క. విను ధర్మజుచెంతకు నా
జననరహస్యమ్ము దెలుప ♦ జనకుము, రాధే
యుని పూతజీవితము జెఱ
చినపాపము దాన నీకు ♦ జెందుగదమ్మా!

ఉ. జలములఁ ద్రోయగాబడి వె ♦ సన్ జనయిత్రికిగూడ భారమై
నలువుర జుల్కనౌటకు మ ♦ నంబున గుందను, పెంచి పెద్దగా
సలిపిన రాధ, నంగవిభు ♦ సల్పి సదా మనసిచ్చి మిత్రుడై
యలరు సుయోధనుం బ్రమ ♦ ద మందగ జేయగ గుందుకైవడిన్

వ. అని పల్కి యర్జునుండుదక్క దక్కిన నీకొమరులు యుద్ధమ్మున నా చేజిక్కినను జంపనని పల్కి కుంతికి నమస్కరించి వీడ్కొని నిజ నివాసమ్మున కరిగె నట శ్రీకృష్ణుండును గౌరవసభావిశేషమ్ముల ధర్మజాదులకెఱింగించి రణోత్సాహులం జేసి ధృష్టద్యుమ్నుని సేనానాయకుం బొనర్చి ద్రుపద, విరాట, సాత్యకిప్రముఖుల దండనాథులగా నొనర్చి యుద్ధభేరి మ్రోయించె నంత పాండవులు మంగళతూర్యారావమ్ము లెసగ నాంగికమాంగల్యసూచకంబులు సేకొనుచు సైన్యసమేతమ్ముగ గురుక్షేత్రంబుం దఱియంజొచ్చి హిరణ్వతీనదీతీరమ్మున స్కంధావారంబు లేర్పఱచుకొని యందు విడిసిరి. కౌరవులును సైన్యసమేతమ్ముగ నా కురుక్షేత్రమునకుం జేరి యొక్కరమణీయ ప్రదేశమ్మున విడిసిరి.





# మహాభారతము



## చక్రధారణము



ఆనందభైరవి - ఖండగతి

ప॥ చక్రధారణకథా - శ్రవణమే సార్థకము
జనసమందినయందుకు...సభాసదులార ॥చ॥

అ॥ ప॥ విక్రమానూను డను - రాపగాసూనుడు
త్రివిక్రము ప్రతిజ్ఞా వి - భంగుజేసిన మహా ॥చక్ర॥

చరణము

గాంగేయు నాధిపత్యమున కౌరవసేన -
కదనమేదిని నిల్చెను - యుద్ధసన్నాహమున
సంగరారంభులై - సైన్యాధిపతిగ పా
ర్షదుని గావించి ని - ల్చిరి పాండునందనులు ॥చ॥

సీ. తన్నర్ధరథు జేసె ♦ నన్న రోసమున రా
ధేయుండు భాగీర ♦ థీసుతుండు
దురమునం బడుదాక ♦ శరశరాసనముల
జేముట్టనని బాస జేసె ♦ గినిసి;
సమరమం దేమెడం ♦ జరియించినం గాని
యస్త్రసంఘాతమ్ము ♦ నందకుండ
సంజయుం గరుణించి ♦ సాత్యవతేయుండు
నిలిపె యుద్ధవిశేష ♦ మూల దెలుపగ

తే. గీ. నాంబికేయుని పొంత, న ♦ య్యవసరమున
ధర్మజుం డాయుధము లర ♦ దమున బెట్టి
చేతులు మొగిడ్చి భీష్ముని ♦ చెంత కేగు
చుంట గని సోదరుల్ వెంట ♦ నంటి యనిరి.

బిలహరి - ఆది

ప॥ అన్నా! పోదువిదేమివిపరీతమాగుమాగుమెందేగదలంచితి ॥వన్నా॥

అ॥ ప॥ చెన్నుసూపు పెన్నడు మనకులమున
నున్నే? రాచరికంపు ధర్మమే ॥యన్నా॥

చరణము

తాతనుభీతిల్లితివో, ధన్వివ - తంసగురుని విఖ్యాతి కోడితివో?
గౌతమునకు వెఱచితివా? క్రాణిగని -
కంపించితివో కల తెఱంగుచెపుమన్నా॥

ఉ. కౌరవసేనగాదు త్రిజ ♦ గమ్ములు పైబడుగాక పోరిలో
శూరతమై జయింపగల ♦ జోదులు నీయనుజన్ము; లేటికిన్
ధీరత గోలుపోవ? నల ♦ తిం గనరే? నగరే విరోధు లీ
తీరు దలంచి, శౌరికిని ♦ దెచ్చెదవే తలవంపు? లగ్రజా!

సీ. పడరానిబన్నము ♦ లన్నోపిన పాంచాలి నిం
తట దిక్కుమాలిన ♦ దాని జేసి
భువనమ్ము లేలు త ♦ మ్ముల బాహువీర్యసం
పదలట్టి తుద ముట్ట ♦ వమ్మొనర్చి
సాయమై వచ్చిన ♦ సకల దేశాధీశ
పాళి కెంతయు దల ♦ వంపుగూర్చి
కడలెల్ల పేర్వాసి ♦ గాంచిన భరతాన్వ
యపు గౌరవము మొద ♦ లంట జెఱచి

తే. గీ. చనెదవా పరిహాస భా ♦ జనముగాగ?
పాలుబోతుదనమ్ము సూ ♦ ప మనయింటి

కుక్కలకునైన లేక, ర ♦ మ్మొక్కుమా ర
థమ్ము; తెగటార్చుమన్న ! శా ♦ త్రవచయమ్ము.

చ. అనవిని మారుపల్కక య ♦ మాత్మజుఁడేగు నెడన్ సురాంతకుం
డనె గనుగొంటి నీఘనుని ♦ యాశయముం గురు వృద్ధ వీరుల
న్గని ప్రణమిల్లి యానతుల ♦ న్గైకొనఁబోవు నటంచు, ధర్మనం
దనుఁడును గేలుమోడ్చుచు పి ♦ తామహుపాలికిఁబోయి యిట్లనున్

శ్రీరాగము - ఆది.

ప॥ తే నమోస్తుగాంగేయాయ, జగత్త్రితయగేయాయ పితామహాయ
అ॥ప॥ మానితాంఘ్రికమలాయ, రిపులోకమర్దనాయ, సత్యవ్రతాయ భవతే

చరణము

సకలాశ్రిత రక్షణధురీణాయ - సమరవిజిత భార్గవరామాయ
ప్రకట చాపకళావిశారదాయ-భరతాన్వయ దీపాయ భీష్మాయ ॥తే॥

చ. ప్రియమున దండ్రిలేని పసి ♦ బిడ్డల బెంచితి వింతదనక వి
ద్దియ లెఱిగించి మంచితివి ♦ తిన్నగ బెద్దలఁజేసినాఁడ వ
న్వయమునబుట్టి నేటికి ర ♦ ణం, బటుగావున నీయనుజ్ఞ నే
గయికొన వచ్చినాఁడ నన ♦ ఘా! నిను మార్కొని పోరొనర్పగన్.

ఉ. తాతవు, మేము మన్మలము, ♦ తప్పకవచ్చె రణమ్ము సేత, నీ
చేతను దీవనల్వడసి ♦ శీఘ్రమ గెల్తు రిపువ్రజమ్ము నీ
వా తెఱ గట్టిదాను, పగ ♦ హారము కాముగదా ? సమానులీ
జ్ఞాతులు, పోరిలో జయము ♦ గాంచగ దీవనలిచ్చి పంపుమా!

వ. అన విని గాంగేయుండు ధర్మనందనుం గని.

క. వచ్చితివి నీకు మేలగు
నచ్చిన మనుమఁడవు నాయ ♦ నా! రాకున్నం
జెచ్చెర శపించిచంపుదు,
నచ్చపు ప్రేముడిని వేడు ♦ మా వరమిత్తున్.

వ. అనినధర్మజుండును.

చ. వలసెడిదేమిః? సర్వము భ ♦ వత్కరుణాపరతన్ లభించె, నీ
వలఘు పరాక్రమక్రముఁడ, ♦ వాయువుమూడిన వాడెగాక ని
న్గలన నెదుర్చువా డెవఁడు? ♦ గావున వేఁడుట దేమి? పోర ని
న్గెలుచు నుపాయమేమొ యెఱి ♦ గింపుము నాకిపుడో పితామహా!

వ. అనిన విని భీష్ముండు సస్మితాస్యుండగుచు ధర్మజుఁ గని నాయనా! నాచేత నాయుధం బున్నంతదనుక దుర్మనుని కేని వధింప సాధ్యంబుగా దిప్పటి కేగుము క్రమ్మఱ నే తెంతువుగాక యనుడు ధర్మపుత్త్రుండు ప్రణమిల్లి వీడ్కొని ద్రోణుని పాలికిఁ జని.

శ్రీరంజని - రూపకము

ప॥ గురువరేణ్య యిదే శిష్య - పరివారంబు ప్రణమిల్లెము ॥గురు॥

అ॥ ప॥ కరుణన్నా కాజి జయము - గల్గునట్లు దీవింపుము ॥గురు॥

చ ర ణ ము

1. మీపై జూపగనాయెను - మీకడ నేర్చిన విద్యల
సైపందగు నీ మా యప - చారము వీరాగ్రగణ్య ॥గురు॥
2. సురలకేని నిన్నెదుర్ప - నుంతయు సాధ్యముగాదన
నరమాత్రుల మేగతి నిలు - వరింపగలమో తెల్పుము ॥గురు॥

చ. తనయునికన్న నెక్కుడుగ ♦ తద్దయు ప్రేముడి మమ్ముజూచి తీ
వనఘ! కృతఘ్నత న్నెఱపు ♦ మాశయెగాని నినున్ జయింప మే
మన నొకపాటివారమె? ద ♦ యామతి నాకెఱిగింపు మేగతిం
బనివడి నిన్ను గెల్వగల ♦ వారమొ? లేనెడ గెల్వనేర్తుమే?

వ. అన విని శరగురుండు కరంబానందించి,

ఉ. మంతిరిమై సాటుండవియయి ♦ మాకెప్పుడే పెద్దప్రాపుగాగ, నను
మ్మింతగ వేడనేటికి? జ ♦ యింతువు నీవ, సమస్తమేదినీ
కాంతుడవై చెలంగుదువ ♦ ఖండరిమావిభవమ్మునీపార నీ
వంతుఁ గేర్పడెన్ జయము ♦ వశ్యము మేసెచ రెంత పోరినన్.

తే గీ. కాదు నిటలాక్షునకును న ♦ స్త్రమునఁ గెల్వ
వినుము! వినరాని యటను ♦ వింటి నేని
యస్త్రసన్న్యాసమొనరింతు ♦ నద్దిపలుక
వాఁడు సత్యవ్రతుండు గా ♦ వలయునయ్య!

వ. అనవిని కౌంతేయాగ్రజుండు సంతసించి కృపుడు చిరంజీవి యగుట వధ్యుండుగామి యాతనికడ సెలవంది శల్యుని యనుజ్ఞ వడసి, కౌరవ సేనం దేఱిపాఱఁజూచి "నాపక్షమ్మున యుద్ధము సేయ నెంచు వారిందెవరే నుండిన రండు. వారిని నాతమ్ములట్లం జూచుకొందు" నని పలుక నిజ సేనాసమేతమ్ముగ యుయుత్సుండు ధర్మనందను బలమ్ములం గలసె నంతలో శ్రీకృష్ణుండు కర్ణునికడకుం జని.

సరస్వతి - ఆది

ప॥ పార్థసముని నిన్నాగాంగేయుం - డర్ధరథు జేసెనా-రాధేయా ॥పా॥
అ॥ప॥ వ్యర్థమనోరథు జేసినీకు తల-వంపుదెచ్చె నే నిపుడువిన్నాడ ॥పా॥

చ ర ణ ము

దీన నీకు లోటేమియును లేదు-గాని లోకువగుదు మెల్లరకును
మానధనుడవిదిచాలదా నీకు-మార్గమొండు తెల్పెద నాలింపుము॥పా

చ. అతనికి నీకు గయ్యమగు ♦ టన్న ననంభవ మౌను, జాహ్నవీ
సుతుడు గతించుదాక నిజ ♦ సోదరపక్షమునందు నిల్వ మీ
గతిపగ దీర్చుకొ మ్మదియు ♦ గాక సహాయమొనర్చిన ట్లగుఁ
హితమతి, పాండవేయుల, కి ♦ దేతఱి మాతృఋణమ్ము దీర్పగన్.

వ. అనిన విని కర్ణుండు నెమ్మనంబున,

శా. ఏ నాభీష్మునిచేత గూలుటయొ? కా ♦ పేనిన్ నదీనందనుం
డే నాచేబడుటో తటస్థమగు నె ♦ ట్లేనిన్ సమాధానమే
యా నీమాయలమారి కృష్ణునకు న న్నవ్యర్థుగా నెంచెనో?
కానిమ్మాతని మాయలో బడుటకుం ♦ గర్ణుండు మూఢుండొకో?

వ. అనితలంచి వాసుదేవున కిట్లనియె.

శా. యావచ్ఛక్తియు ధారవోసితివి స ♦ న్నాహార్థులం జేర్ప నా
భావం బా పని సమ్మతింపదిక బా ♦ వా! కౌరవాధీశు పాల్
గావింపంబడె నా శరీర మనిలో ♦ గాల్పోట్ల కేచున్న నా
కావంతేనియు లేదు కోపము మహా ♦ త్మా! జాహ్నవీపుత్రుపై.

వ. అనినవిని మాధవుండును,

శా. నిన్నీ హస్తిపురాధినాథు సలుపన్ ♦ నే జేయుయత్నమ్ము లి
వన్నింటిన్ విఫలమ్ము నర్చితివి నా ♦ యుం దేమియున్ లోటు లే
దెన్నం బార్థుని చేతిలో మడియు వా ♦ రీ భీష్ములున్ ద్రోణులున్
మన్నీలుం దలపోయుమీ యెవడో క ♦ న్నా! సుంత కృష్ణుండనన్.

వ. అనిపల్కి కృష్ణుండు కౌంతేయులం జేరె నంత స్వపక్షపాలితంబగు కౌరవసైన్యంబున భీష్ముండు రథమ్ముపై నిలిచి సింహనాదమొనర్చి శంఖమ్ము పూరింప కృష్ణార్జునులు పాంచజన్య దేవదత్తంబులు పూరించి దెసలు చెవుడు పఱచిరి. పిమ్మట యుద్ధప్రారంభ సమయంబగుటయు గపిధ్వజుండు గాండీవధారియై గుణంబు సారించి బాణపాణియై యున్నంత హృషీకేశుండు రథం బుభయసేనా మధ్యంబునకు బోనిచ్చి నిలిపి ప్రతివీరులెల్లరం జూప జూచి గుడాకేశుండు స్వజనసంహారంబునకు శంకించుచు మోహావిష్టుండగుచు జగన్నాథున కిట్లనియె.

భూపాల - చతురశ్ర.

ప॥ బంధుజనుల బరిమార్చి దేవేంద్ర-పదవియైన నాకిమ్ము నేనొల్ల॥బం॥
అ॥ ప॥ బంధునాశనమునకన్న వేఱొండు పాపమున్నె కృష్ణా లోకేశ్వర॥

చరణము

తాతతండ్రులన్ మామలన్ సుతుల దమ్ముల నన్నల గూల్చు నావంటి
పాతకునకు పరలోక సుఖమ్ములు వచ్చునెట్లు చెపుమా తమ్మికంటి॥

సీ. ఉభయపక్షమ్ములం ♦ దున్న బాంధవులు స
చ్చుట కియ్యకొని లావు ♦ చూపి చంపి

యవల దుచ్ఛమగు రా ♦ జ్య సుభోగముల కాస
గొనుకన్న బిచ్చపు ♦ కూడు మేలు
కులనాశనము సేయ ♦ గులధర్మములు డఁగు
కులధర్మ హీనులై ♦ గూలురు నరక
కూపమ్మునను; నిట్టి ♦ క్రూరకర్మ మొనర్ప
సమ్మతింపదు నాదు ♦ నమ్ము కృష్ణ!

తే. గీ. అని విషాదమ్ము గదుఱయు ♦ నచ్చుపడఁగ
బాణబాణాసనమ్ముల ♦ న్వదలి కంటి
నీరుదొరఁగ రథమ్మునం ♦ గూరుచున్న
వాసవకుమారుతో శౌరి ♦ పలికె నిట్లు.

ఉ. శూరులు నవ్వరొక్కొ? నిను ♦ జూచి ధనంజయ! సద్వివేకివై
పోరిజయమ్ముగాంచి, యశ ♦ మున్ గడియింపుము నిత్యుఁడాత్ముఁడ
ప్పూరుషు జావుపుట్టుకలు ♦ బొందవు నీవు నిమిత్తమాత్రమై
వైరులుగూల్పు మిక్కుటన ♦ పాపము సెందదు నిన్ను ఫల్గునా!

వ. అని పలుకుచు దత్త్వజ్ఞానోపదేశంబు సేయఁ దలంచి యిట్లనియె.

ఆనంద భైరవి - చతురశ్రగతి.

ప॥ వినరా తెలియగవివరించెద నీ - కాత్మబోధపార్థా పార్థా॥వినరా॥
అ॥ప॥ తనువులుబుద్బుదములపోలికనిత్యములుగాపునిజమాత్ముఁడునిత్యుఁడు

చరణము

1. చెఱుపడుచెడడీపురుషుడున్నను-పురుషోత్తముఁడేనై మొఱపింతును
చెఱతువివు చెడుదురు శాత్రవులని-చింతింపకుమోయీ ధనంజయ॥
2. రణముత్తమ ధర్మము రాజులకును-గణనీయము మోక్షప్రదమ్మగు
అనుమానింపకలెమ్ము సంగ్రామ-మొనరింపుము మేలౌవీరాగ్రణి॥వి॥

సీ. అవ్యక్తరూపుడ ♦ నై పూసలందు దా
రము వోలె నఖిలభూ ♦ తముల నుందు
జగములన్నిటికి బీ ♦ జము మదీయాంశము
నన్నెఱుంగుటయె జ్ఞా ♦ నం బనబడు

నా నిర్మితము కర్మ ♦ గాన తత్ఫలకాంక్ష
నెడసి నాయందె క ♦ ర్తృత్వముంచి
యనహంకృతియు నిస్పృ ♦ హత్వమ్ముఁగలిగి గె
ల్పోటముల సమబుద్ధి ♦ నుండువాని
తే. గీ. కే విచారమ్ము నంటదో ♦ యీ కిరీటి!
వివిధకర్మఫలమ్ము ల ♦ ర్పించి నాకు,
నను శరణుబొందు, మల్లేని ♦ నిను సమస్త
పాపములనుండి తొలగించు ♦ వాడ నెమ్మి.

వ. ఇట్లు పలుకుచు వివిధప్రకారంబుల విజయుం డడిగిన వానికెల్ల సదుత్తరంబు లిడి యింకను మనసు కసటువాయకున్నం గని విశ్వరూప ప్రదర్శనం బొనర్పం దలంచి సవ్యసాచికి దివ్యచక్షుర్జననంబొనర్చి,

సీ. తనయందు దేవగం ♦ ధర్వాది ముఖ్యులున్
సచరాచరంబైన ♦ జగము దోప
మకుట కేయూరాది ♦ మహిత భూషణ రాజి
తనర జక్రాద్యాయు ♦ ధములు వెలుగ
రవి సోము లక్షులై ♦ దివుర దంష్ట్రాకరా
ళంబులై మీఱు ము ♦ ఖంబు లలర
నారదాదిమునీంద్ర ♦ వారమ్ము తనుజుట్టి
ప్రస్తుతించుచు బరా ♦ బరులు సేయ
తే. గీ. భూ నభో దిగ్దిగంతర ♦ స్ఫూర్తినొప్పి
పావకజ్వాల లొకట వె ♦ ల్వడు నిజాస్య
గహ్వరమ్ముల భీష్మాది ♦ ఘనులు సొఱఁగ
విశ్వరూపమ్ముఁజూపె నా ♦ విజయునకును.

వ. అట్లు సూపి వెఱగంది ప్రస్తుతించుచు నిలిచిన బలారికుమారుంగని,

శా. నే లోకక్షయ కర్తనౌ యముఁడ గుం ♦ తీనందనా! యెల్లర
న్నాలో జేరుచుకొందు భీష్మముఖు లీ ♦ నాచేతనే చత్తు రీ

లీలన్నివు నిమిత్తమాత్రుడవునై ♦ తెమ్మాజిగాచింపు మిం-
కేలా జాలము? గెల్పునీ కిదుటయే ♦ యీనాతలం పర్జునా!

వ. అనిపల్కి హృదయానుచలత మాన్పి వివిధగీతుల జ్ఞానోపదేశం బొనర్చి విశ్వరూపం బుపసంహరించి, విజయుని సముత్సాహుం గావించె నంత యుద్ధప్రారంభమగుటయు సింహనాదంబులకు దోడు శంఖరావమ్ములు సెలంగ నుభయసైన్యంబులు వివిధవ్యూహంబులం బన్నుకొని యురవడించి పోరాడునెడ సముద్దండవేదండతుండ శీకరతురగలాలాజాల రక్తధారాపరిషిక్తంబై సంగ్రామ ధరణీరజం బడంగ నసంఖ్యాక బాణపాతంబున సూర్యబింబంబు మఱుగై చీకట్లు గ్రమ్మ, ధర్మభీమార్జున నకుల సహదేవ ధృష్టద్యుమ్న ఘటోత్కచాభిమన్యు ద్రుపదేయాదులును భీష్మద్రోణకృపాశ్వత్థామదుర్యోధన దుశ్శాసనాదులును తమతమ బలంబులం బురికొల్పుకొనుచు ఘోరమ్ముగ బోరాడుచుండ నుత్తరుండు మున్నగువారెందరో లెక్కకు మిగిలి వీరస్వర్గ మలంకరించుచుండ నడుమ నడుమ భీష్ముండు విజృంభించి పాండవసైన్యాటవి పైబడి కాఱ్చిచ్చు వసచ్చునం దఘలం బెట్టుచు నేరికిం జేజిచూడరాక చిత్రగతుల యుద్ధంబుసేయుచు మూడవనాటి యుద్ధంబున గోటిసూర్యప్రభాభాసమానుండై ప్రళయరుద్రుండన నరివీరుల జిందరవందర సేయుచు కృష్ణార్జునులపై బెడిదమ్ములగు నాలమ్ములం గురియించుచు బిట్టలయించునంత దనుజాంతకుండు తలంచినంత మాత్రమ్మున సన్నిహితంబైన సుదర్శన చక్రమ్మును దక్షిణకరంబున నమర్చి పగ్గంబుల నొగల ముడిచి,

కళ్యాణి - ఆది

ప॥ నగధరుండుస్యందనము పైనుండి- యెగసి ధరకు గుప్పించిలంఘించె॥
అ॥ప॥ గగన్నభాగమెల్లస్వీయకుండల- కాంతిపుంజ మెంతేనిగప్పికొన॥
1. అవనియెల్ల గంపింప - లలిత పీతాంబరంబు చెఱగు దూలియాడగ
నవిరళముగ మస్యత్తుస్దర్శనర- థాంగరోచులుతుఱంగలింపగా॥న॥

2. పులిగన్న లేళ్ళగమిఁబోలె శత్రుభూమీశులు విశ్చేష్టులై సూడ
వెలవెలబడ విజయుండు భీష్మకుంభీంద్రుపై నుఱుకు యనుసింహుండై॥

మ. నను వృద్ధుండగు జామదగ్ని యనుకొ ♦ న్నావేమొ? చాలింపు మొ
క్కనిమేషమ్మున చక్రఘాతమున జ ♦ క్కం జేతు నన్నున్ సుయో
ధను ద్రోణాదుల నెల్ల సైనికుల నా ♦ ద్ధత్యమ్మునన్, ధర్మనం
దను నేడే యభిషిక్తు జేయుదు మహేం ♦ ద్ర ప్రాభవం బేర్పడన్.

తే. గీ. జనకు డొకవేళ నీకు స్వే ♦ చ్ఛామరణ మొ
సంగెను గదా యటంచు లో ♦ బొంగెదేమొ
సంతసింపకు మీ సుద ♦ ర్శన రథాంగ
మిపుడ నీపని దీర్చు మి ♦ న్నేటికొడుక !

వ. అనిన విని శాంతనవుండు చేతులు జోడించి దేవా! లీలామానుష విగ్రహా!

శుద్ధసావేరి - ఆది.

ప॥ అంతకన్న వలసిన దేమున్నది-యచ్యుతా నను గృతార్థునిం జేయు ॥మం॥
అ॥ప॥ యెంతవారికి లభించు నిట్లు నీ-యంతవాని నెదిరించి కడ తేరు॥టం॥

చరణము

వీరమాత యను యశమందె నమ్మ - గీరథీదేవి నా తల్లి నేను
నారాయణ! శంతను భూపతి యెంత-యు బుత్రవంతుడయ్యె నీ నాడు॥అ॥

గీతమాలిక.

అట్లు జమదగ్ని నందను - నాశ్రయించి
నేర్చినట్టి నా యీ ధను - ర్నిగమ మెల్ల
భువన విఖ్యాతమయ్యె, నా - భవము పావ
నత గనెన్, సద్యశమ్ము మి - న్నంటె కృష్ణ!
ధర్మమూలకమైన వే - ద ప్రపంచ
మందు తెలియందగిన వాడ - వౌదు వీవు
విజయునకు విజయమ్ము గ - ల్పింప దలచి
సమర మొనరింపనని ప్రతి - జ్ఞం బొనర్చి

నాడవేగాని, యుద్ధ మ్మొ - నర్చు తెలపు
వరలుచో నీకు విశ్వరూ - పప్రదర్శ
నమ్ముతోడ భారతసంగ - రమ్ము ముగియు
వలసినది; యని నేత కు - పక్రమించు
చెంతయు మదీయశౌర్య వి - క్రాంతి కొకట
నోహటించు ధనంజయు - బాహుబలము
బలియు బరికొల్పుటకు జన్ము - పన్నగడయొ?
వనజనాభుండు దక్క - శాం - తినపు గెలువ
జాలు విల్కాడు లేడు మ - జగములంద
టన్న సద్యశముం గూర్చు - నభిమతింబో?
శిష్టరక్షణమును దుష్ట - శిక్షణమ్ము
నీపనులు గాన నే నవి - నీతుడైన
కౌరవేంద్రు పక్షమ్మున - గయ్యమాడు
కారణమ్మున దుష్టుని - గా దలంచి
చంప నుంకించితో సుద - ర్శనమువిడిచి
రిత్తగాకుండ నాకంత - యుత్తరించి
నెమ్మి నన్ను నీలో గల్పు - కొమ్మనంత!
అవ్యయానంద! గోవింద! - హరి! ముకుంద!

వ. అట్లు పలుకుచున్నంతలో నర్జునుండు రథంబు డిగ్గనుఱికి దీర్ఘబాహువుల నాచివిశ్వంభరుం గ్రుచ్చిపట్టి రణావేశంబున ముందునకుంబోవ నుంకించు గోపాలు నీడిగిలంబడి నిలువంబెట్టి యిట్లనియె.

యమునాకళ్యాణి - ఆది.

ప॥ కరుణానిధి శాంతింపగదే - యీకయ్యమాను సంరంభముడిగివడి॥

అ॥ప॥ హరినీవేరణమొనరించినచో - నాగునెయీపదునాల్గులోకములు॥

చరణము

గీతల్చెప్పితి విందులకా - భూనేతల్నవ్వగ బాలు సేయుటకా ॥గీ॥

చేతులోడ్చి నమస్కరించు నా - ఖ్యాతినిల్లుపుము పోల్లసేయకుము॥

ఉ. తాతయు మన్నృపున్ సమర ♦ ధారుణి బోరెడుతీరు నీవయే
చూతువుగాక లెమ్ము మధు ♦ సూదన! నీవిటు విక్రమించుటల్
నీతియె? కాక నల్వురను ♦ నే వలయెత్తగ నేర్తునే? యుప
ఖ్యాతిగడించి యీవిజయు ♦ డన్న మొగం బెటుజూచు నచ్యుతా!

చ. అరివిజయమ్ము పట్టున నొ ♦ కప్పుడు కొండొక హెచ్చుతగ్గు లీ
వరుసఘటించు టెరిక స్వ ♦ భావముగాదొకో? యంతమాత్రనే
దురమొనరింప బూనితివి ♦ తోయజనాభ! యిదేటివాయమో
యరయుము, సాత్యకిం గనుము ♦ నట్టికి బూనమున కేగి తేలియున్.

వ. అని పలుక సవ్యసాచి సమయజ్ఞతా పరిజ్ఞానమునను శౌరి సాంత్వ
సించి యతనికి బ్రియమ్ముగా నిట్లనియె

ఉ. ఆతడు నీవునున్ సముడె ♦ యందుల కేనెపు డొప్పుకొందు, నీ
తాతగదాంపటన్న దయ ♦ దాల్చెద, వంతగ, నొవ్వగొట్ట వీ,
వాతడు నీపయి న్నెటప ♦ డక్కట టెక్క, మ్మటుగాన జక్రముం
జేతధరింపగా వలసె ♦ సేయున దేమిక నూహకున్నచో?

వ. అన విని యర్జునుండు,

శా. ఈయుత్ప్రేక్షలు నే నెఱుంగనివి కా ♦ పీబాంధవ శ్రేణితో
నేయుద్ధం బొనరింప గొంకుటయు నెం ♦ తే గీత బోధించి నీ
వా యజ్ఞానము వాపుటల్ గడచె నా ♦ కాలాటి కారుణ్యమే
పోయెం దావక విక్రమస్ఫురణమే ♦ పోల్కన్ సమర్థింతువో.

ఉ. చిన్నతనంబునందు చెయి ♦ జేతుల నెత్తి యెత్తడసుమ్ము మా
యన్నలదమ్ములన్ బెనిచె ♦ నందర గావున నొక్కవేళ మా
యున్నతి గోరు నీతనికి ♦ నుండిన నుండగవచ్చుబేర్మి, నా
కెన్నగలేదు భీష్మునిప ♦ యిన్ దయ నక్కను దాపనేటికిన్?

వ. అనిపలికి గోపాలు నొగలెక్కించి దేవదత్తంబొత్తి భీష్మాదులగ్గింప
సవ్యసాచి సమరనైపుణిం జూపె.



# మహాభారతము



## భీష్మపతనము



హంసధ్వని - రూపకము.

ప॥ వినుడు భీష్మపతనకథా - విశేష మెఱిగింతు మీకు ॥విను॥
అ॥ ప॥ వినవిన భారత మ్మెంతొ - వీనులకుం జేయు విందు ॥విను॥

చరణము

జనకునకై యతఁడు బ్రహ్మ - చర్యవ్రత మూనె
తనునమ్మిన దుర్యోధను - తరఫు కయ్యమాడఁబూనె॥

సీ. తనదు తాటిసిడంబు ♦ తళతళ మెఱయ నా
ల్గవనాటి రణమున ♦ గంగకొడుకు
ద్రోణశారద్వతా ♦ దుల గూడుకొని పార్థు
పై బడునంత సౌ ♦ భద్రు డలిగి
తన్నడ్డి పోరుచో ♦ వెన్నుగానక కొంత
వడికి వాసవపౌత్రు ♦ గడచి సవ్య
సాచితో డీకొని ♦ సమరం బొనర్ప ని
వ్వెఱపడి సూచి రె ♦ ల్లరు నిరుదెస

తే. గీ. ద్రౌణి భూరిశ్రవులు శల్య ♦ తనయ చిత్ర
సేను లొకపెట్ట నభిమన్యు ♦ పైని బడఁగ,
నగుచు గురుపుత్రు నురమేసి, ♦ నఱికి చిత్ర
సేనుధనువు, భూరిశ్రవు ♦ సిడము ద్రుంచె.

అట్లు పెక్కండ్రతో బోరాడు కుమారుం గని విజయుం డార్చి వారిపై జలుకుటమ్ములం గురియుచో గురు కృప శల్య కృత వర్మాదులును కేకయులును ముప్పదేను వేల రథమ్ములతో ద్రిగర్తలును గవిసి సౌభద్రుం బాదువ నయ్యెడి గని ధృష్టద్యుమ్నుండు శౌర్యోద్రేకమ్ము దీపింప నరుదెంచి వారిం దాకి పోరుచు శల్య తనయుం గూల్చి శల్యునితో యుద్ధము సేయుచుండ సుతశోకాతురుండు తోడువచ్చిన పిన్నతండ్రులం గలసి సౌభద్రుం డొదలకన్నిరూపులై శాత్రవులం గూల్చుచుండె నట్టియెడ గదసారించుచు దీవ్రకోపుండై భీమసేనుండు కురుసైన్యంబుపైబడి నురుమాడుచు కదనోర్విం బీనుంగుపెంట గావించుచు, ధార్తరాష్ట్రులం బెక్కురం గూల్ప కురుసైన్యంబు చెల్లాచెదరై పాఱుచుండ దుర్యోధనుం డొక్కండ భీముందాకి మూర్ఛిల్లె నంతలో నరకాసుర కుమారుం డగు భగదత్తుండు తన మత్తగజమ్ముం బాండవ సైన్యముపై బఱప నయ్యది పెక్కండ్ర యోధులం జదిపె నంతలో ఘటోత్కచుం డంతకాకారుండై యుద్ధామగమున దుర్వారంబగు నొక్క వారణం బెక్కి భగదత్తుపైబడి పోదివి యాతనిం బలాయితుంజేసి యాచార్య ప్రభృతులపై బడి నొప్పించుచో భీష్ముండు వెఱచి నాటికి పోరు సాలింప నాజ్ఞాపించె నిట్లు సమరం బతిఘోరంబై చూపట్టు గ్రమమ్ముగ దొమ్మిదవనాటి యుద్ధమ్మున భీష్ముండు ప్రళయరుద్రుని భంగి మూర్తీభవించి వివ్వచ్చు నొప్పించి పాండవసైనికుల గొఱియలమందలంబోలె దోలుచుండ.

చ. పుడమి వడంక, దిక్కరులు ♦ క్రుమ్మొగ్గతిలంబడ, జచ్చె జచ్చె భీ
ష్ముడనెడి పేరెలుంగు దివి ♦ ముట్టగ, చక్రముచే ధరించి కృ
ష్ణుడుఱికి తేరినుండి రిపు ♦ సూదనతాభరమూని భీష్మపై
బడునెడ సవ్యసాచి వడి ♦ వచ్చి జనార్దనుతోడ నిట్లనున్.

కాఫీ - చతురశ్రగతి

ప॥ యదుకుంజర! కోపము సంహరింపు-మార్తావనలోలా యిది మేలా॥
అ॥ప॥ రథమెక్కుము శౌరి మదీయశర-లాఘవంబు కన్నారజూడుమిక॥

చరణము

నీవండగ పైనుండినంజాలు - నిఖిలజగము లవలీల జయింతును
దేవదేవ! తలవంపు గూర్తువే-నీ నీ విజయమునకో దయానిధే ॥యదు॥

చ. అనవిని తేరిపై నిలిచె ♦ నద్దనుజాంతకు డంత నింద్రనం
దనుడు సురాపగాతనయు ♦ దాకి రణంబొనరించె నంతలో
నినుడపరాబ్ధి మాటువడె ♦ నెంతయు జింతిలి ధర్మసూతి తా
ననుజులు దోడరా సని ము ♦ రాంతకు పాలికి, మ్రొక్కి-యిట్లనెన్.

ఉ. ఎచ్చట దావాగ్నియై మనల ♦ నెల్లర గాల్ప దొడంగె నిట్లు కా
ర్చిచ్చువిధాన భీష్ము, డిక ♦ నేయునదేమి? ముకుంద! యందఱుం
జచ్చినవెనుక రాజ్యము వ ♦ శంబగుగాక, ప్రశాంత దమిచ్చునే?
కచ్చియమాని ఘోరవధము ♦ కానలకుం దపమాచరింపగన్.

తే. గీ. మున్ను నాకారణమున నె ♦ న్నెన్నొ యిడుమ
లనుభవించిరి నాతమ్ము ♦ లట్టి వీరి
గనులజూచి యే మోదంబు ♦ గందుగాని
చంపుమని తాత కే నప్ప ♦ గింపజాల.

వ. అనవిని వసుదేవనందనుం డిట్లనియె.

చ. మనము రహస్యవర్తనము ♦ మై జని యెల్లర మా సురాపగా
తనయుని గాంచి మ్రొక్కి- "నిను ♦ దాకి రణమ్మున నిల్వనోప మే
యనువున నిన్ను గూల్పనగు ♦ నయ్యది మాకెఱిగింపు" మంచు వే
డిన నెఱిగించు నాతడు క ♦ డింది యనుగ్రహ మూని ధర్మజా!

వ. అనవిని ధర్మజుం డనుజుల న్వెంటనిడుకొని నాటిరేయి నిగూఢమ్ముగ గాంగేయుమందిరమ్మున కరిగి తత్పాదములకుం బ్రణమిల్లనతండును పేరుపేర నెల్లరిసేమంబు లడిగి వచ్చినపని యే మన దీనాననుం డగుచు ధర్మసూనుం డిట్లనియె.

ధన్యాసి - రూపకము.

ప॥ సేమ మేవిధాన గలుగు - నీ మాకెల్లఱకు తాత ॥సేమ॥
అ॥ప॥ నీమనుమల మార్తింబడి - నేటికి మ్రందుచునుంటిమి ॥సేమ॥

1. సైనికులకు నీపేరొక -సారి విన్న నిదుర రాదు
గాననైతి మున్నిగతి - కయ్యము గావింతు వంచు ॥సేమ॥

2. చచ్చిఱ కనుమూసి యొకట - జేతిత్రిశూలమ్ముదాచి
వచ్చిన రుద్రుఁడ వోర్వఁగ - వచ్చునె నిన్నెరికైన ॥సేమ॥

చ. అనవిని జాహ్నవీతనయు ♦ డయ్యమునందను గాంచి పల్కె, చే
ధనువుగలంతదనుక నను ♦ దాకి రణమ్మున నిల్వజాల రా
యనిమిషులేని, కావున ద ♦ యామతి మీ కెఱిగించువాఁడ గె
ల్పునకగు మార్గమున్, సుకృత ♦ ముం గయికొందు దదీయసంగతిన్

తే. గీ. అంగనను, నంగనాపూర్వ, ♦ నంగనాభి
ధాను, దలచీర వీడిన ♦ దాని, భ్రాతృ
హీను, ననపత్య మారొకన ♦ నెన్నఁడేని
యిదె మదీయవధోపాయ ♦ మిద్ధచరిత !

క. తనర శిఖండిని మున్నిడు
కొని వాసవసూతి నన్ను ♦ గూల్పఁగల డనిన్
నను గెల్చినచో గౌరవు
లను గూల్పఁగ మీకిక న్సు ♦ లభమగుగాదే ?

వ. అని పల్కిన దేవవ్రతుచే ధర్మజాదు లనుజ్ఞాతులై నమస్కరించి
వీడ్కొని విడిదులకుం బోవునెడ విజయుం డచ్యుతున కిట్లనియె.

భూపాల - ఆది.

ప॥ పెంచి పెద్దజేసిన తాతను వం - చించి గూల్ప నాచేతు లెట్లాడు॥
అ॥ప॥ కొంచెపుమానిసు లీపాండవులని-కోవిదు లీసైమము దూషింపరె

చరణము

లోకమాన్యుఁడు దయాళుడున్ ధర్మ-లోలుఁడుకులవృద్ధుఁడు గాంగేయుఁడు
యీకిరాతకృత్యమ్ము గావించి-యిహపరమ్ములకు దూరమగుదు నే॥పెం॥

సీ. స్వార్థపరిత్యాగి ♦ యై తండ్రి కా సత్య
వతి నాలిజేసిన ♦ బ్రహ్మచారి

మనుజ దంష్ట్రి లేని లో ♦ కము దీర్చి యెంతయో
కాపాడినట్టి ద ♦ యాపయోని
పలుమారు సభలలో ♦ పాండునందనులు ధ
ర్మాత్ములం చాడు య ♦ థార్థవాది
యస్త్రవిద్యారహ ♦ స్యము లన్నియు నాకు
దెలియ బోధించిన ♦ దేశికుండు

తే. గీ. తనవధోపాయ మిట్లు శా ♦ త్రవులకైన
మా కెఱింగించినట్టి య ♦ మాయకుండు
సురనదీసూను డట్టి ధ ♦ ర్మాత్ము భీష్ము
మోసగించి కూల్చుటకన్న ♦ దోసమున్నె ?

వ. అనిన విని కృష్ణుండును,

ఉ. పున్నెము పాప మంచు దల ♦ పోయక వైరుల నెట్లు గూల్పగా
నెన్నగు నట్లు గూల్చి జగ ♦ తీవలయ మ్మఖిలమ్ము నేలుటే
యెన్నని రాజధర్మమగు ♦ దీనికి నీమది సంశయింపగా
జన్నె? బలారినందన! వి ♦ వాదము వీడి జయమ్ము గాంచుమా.

వ. అనవిని ఫల్గునుండు

తే. గీ. ఆపగేయవధార్థమై ♦ యా శిఖండి
జననమందెగదా! నదీ ♦ తనయు నతడె
కూల్చుగాక, నే నన్యులం ♦ గూల్చువాడ
చేతులార దారుణ మిట్లు ♦ సేయజాల.

వ. అనినవిని కృష్ణుడికిం గమలనాభుం డిట్లనియె.

చ. అనితరవధ్యకాయుఁడను ♦ మా! తటినీసుతు డీవు దక్క య
య్యనఘుని జావ సేయగల ♦ యంతటి వీరుడు లేడు కావున
న్మనమున సంశయింప కను ♦ మాత్రము భీష్ముని గూల్పుమా శిఖం
డిని వడి ముందునిల్పుకొని ♦ నిర్భయమా మనసేన కవ్వలన్.

వ. అనవిని పార్థుం డియ్యకొనియె నాటిరేయి గడచుసంత సూర్యోద
యంబగుడు నుభయ సైన్యంబులుం గదిసె పోరాడునెడ శిఖండిం

బురస్కరించుకొని యాఖండలనందనుండు మందాకినీనందను నెదిరి పోరాడుచో నేయుటమాని భీష్ముండు కురుపతింగని.

దర్బారు - రూపకము.

ప॥ బడలితి నిన్నాళ్ళదనుక - పవర మొనర్చినకతమున ॥బ॥

అ॥ ప॥ ఒడయడ! నీమనిచినబుణ - మొగిదీర్చితిలావుకొలది ॥బడ॥

1. పదివేవుర జంపుదునని - శాసజేసితిని నీకడ
నదయత శాత్రవుల దునిమి - యటు కృతకృత్యుడనైతిని ॥బ॥

2. మానవుండ పాండవుల న - మానుష విక్రముల గూల్ప
కానిపనిగదా యైనను - కనుగొనుమా నేటికలను ॥బడ॥

క॥-అనిపలుకుచు నిర్ధూమద
హనుపోలిక పాండవేయ ♦ యాదవబల కా
ననముల దహించుచు మా
రొక్కనుటయు నపు డాహవమ్ము ♦ ఘోరంబయ్యెన్.

సీ. అన్యోన్య శరసమూ ♦ హ నికృత్త బాహ్వంఘ్రి
పీనకంధరు లగు ♦ వీరభటులు
విగతహస్తంబు లౌ ♦ వే దండములును, హ
తాంగమ్ములైన శ ♦ తాంగములును
పరలోకనీతులై ♦ పరగు సూతులు సము
ద్ధూతపుచ్ఛమ్ములౌ ♦ తురగములును
జర్జరీభూతమౌ ♦ శస్త్రాస్త్రనిచయము ల్
సంఖండిత పతాక ♦ సంచయములు

తే. గీ. గలిగి కదనోర్వి కడుభయం ♦ కరముగాక
తుములమయ్యె; బాకారి సు ♦ తుడు శిఖండి
ముందునిడుకొని భీష్మపై ♦ ములుకులేయు
సమయమున నడ్డుదగిలె దు ♦ శ్శాసనుండు.

తే. గీ. అడ్డువడిన దుశ్శాసను ♦ నంతలోగి
రీటి బాణపాతమున మూ ♦ర్ఛిల్ల జేసి

తనకు భీమాభిమన్యు సా ♦ త్యకులు తోడు
గాగ గాంగేయుపై నంప ♦ గములు నించె.

వ. అట్టియెడ భీష్ముండు నవ్వుచు శిఖండి నుద్దేశించి యిట్లనియె.

భైరవి - ఆది

ప॥ మగువనీవుమగవాడవైయిట్లు-మగలజన్మించినా నాపగదీర్చుకొనగ॥
అ॥ప॥ నగరే నను నీతో పోరాడ - నానాటి రాచవాడు శిఖండీ ॥మ॥

చ ర ణ ము

పరశురాము ప్రాపున మోసపోయి - పాండుతనూభవుల నాశ్రయించితివి॥
శరము లేసి కసి వాపుకొమ్మిదే - చాలింపదలంచితి నా మేనిక ॥మ॥

చ. అనుచు రణమ్ము సేయునటు ♦ లల్లన ధర్మజు జూసి 'మన్నడా!
పనివడి మీరలెల్ల రొక ♦ పట్టున పైబడి యేయు జాలసిం
చిన జెడు గార్యమం' చనగ ♦ సేనలకుం బురికొల్పె ధర్మనం
దను డటుపై జెలంగె కద ♦ నంబు భయానకమై యొకంతలో.

ఉ. తమ్ముల దక్కు జోదులను ♦ దా బురిగొల్పి సుయోధనుండు ద
ర్పమ్మున నాపగేయునకు ♦ బాసటవై నిలువన్ వృకోదరుం
డమ్మెన బాఱదోలి ప్రళ ♦ యాంతకురీతి దురమ్మునన్ విహా
రమ్మొనరించె దన్నొగి సు ♦ రప్రకరమ్ము నుతింప పెంపునన్.

వ. అట్టిచో నర్జునుండు శిఖండిం దఱిమి తెఱపిసూపి దేవవ్రతు నేయు
మనుచు నిట్లు పురికొల్పె.

శా. ఏనున్నాడ భయమ్ము లేదిక శిఖం ♦ డీ! యేయుమా భీష్ము నీ
పై నెప్పట్టున నీగనైనను సరే ♦ వ్రాలంగనీ నెట్టులో
నీనాడే పగదీర్చుకొమ్ము తఱి య ♦ య్యె న్నీదు ప్రాణాలకే
బ్రాణంబోడ్డుద సంశయింపకుము నా ♦ రాచమ్ము సంధింపుమా.

వ. అనునెడ శిఖండి గాంగేయుపై వాడిములుకులం గుఱియించు
చుండ శల్య కృపాశ్వత్థామ కుంభసంభవకృతవర్మాది యోధు
లొక్కపెట్ట ధనంజయుం బొదువ నప్పార్థుండు వాయవ్యాస్త్ర
ప్రయోగమ్మున వారెల్లరను దూరస్థులం జేసి శిఖండిమాటుననుండి

భీష్మునిచేతివిల్లుం దునిమి యతినిష్ఠురమ్ములగు నారసమ్ములందనువు పొరనేయ దెలిపిగొనక దివిషన్నదీసూనుం డిట్లని వితర్కించె.

నీలాంబరి - చతురశ్ర.

ప॥ ఇవి శిఖండిబాణములే యగుచో నింతగా నొప్పిదెచ్చునా ॥యివి॥

అ॥ప॥ అవశమగుచు కర్కటిగర్భమువలె దనిలి నను బ్రతుకనిచ్చునా॥

చ ర ణ ము

మఱియు బ్రహ్మదండముల పాటియై యుర్విలో లేటు వోనాటునే
పురుషకారమున గమలభవుగీటు - నసుకొన్నదైన దాటునే ॥యివి॥

సీ. జననమందితిని ప్ర ♦ శ స్తమౌ భరతవం
శమున భాగీరథీ ♦ శంతనులకు
చివరంట నభ్యసిం ♦ చితి ధనుర్నిగమంబు
రవితేజు భార్గవ ♦ రాముగొలిచి
పాలించుకొంటి యా ♦ వజ్జీవపర్యంత
మటు బ్రహ్మచర్య స ♦ త్య వ్రతముల
నేలించితి ధరిత్రి ♦ నెల్ల సక్రమముగా
సాత్యవతేయ వం ♦ శజులచేత

తే. గీ. కడకు సమరమ్ము గావించి ♦ కౌరవేంద్రు
ఋణము నైతముదీర్చుకొం ♦ టిని, మఱేమి
గావలయు నాకు, నిశ్చింత ♦ గా శరీర
మింకజాలింతు, గలియుదు ♦ నిందిరేశు.

క. అని వాలుంబలకయు చే
గొని యరదము డిగ్గ చుఱుక ♦ గొబ్బున నవి తు
త్తునియలొనర్ప నరుడు, శాం
తనవుడు బడె నంత దూర్పు ♦ తలగాగ వడిన్

తే. గీ. తల్పముంబలె శరములూ ♦ తగ నిలువగ
తనువు ధారుణి సోల ద ♦ వ్వేము కిరీటి
తాతకు దలాడిగా శర ♦ వ్రాత మునిచె.
నట్లు శరతల్పగతుడయ్యె ♦ న య్యనఘుడు.

వ. అంత మునివరులు హంసరూపంబులం జనుదెంచి గాంగేయునకు దక్షిణాయనం బగుటెఱింగించి చనిరి. ఉభయసైనికులును యుద్ధమ్ము మాని గన్నీరుగార్చుచు సమ్మోహనీయుం జుట్టునిలువ నొకంతకు శాంతనవుం డిట్లనియె.

నాటకురంజి - ఆది

ప॥ మునులార నాకొఱకువిచారము-మానుడింక దేహముపాలించెద॥

అ॥ప॥ చనునింకిటనైనను ఱారెల్లను-సమయమునన్నామనిసంధింపఁటయో॥ము॥

చరణము

జనకు డొసఁగిన వరబలమున స్వ-చ్ఛందమరణంబు నాకు లభ్యమగు
నినుగొల్చుచునుత్తరాయనమువఱ-కిట్లేనుండు గనంపపాన్పుపై॥ము॥

క. నాకంతదనుక రక్షం
జేకూర్పగ వలయుననగ ♦ శీఘ్రము వారుం
బ్రాకారము గట్టింపగ
నాకనదీనందనుం డ ♦ నంతర మనియెన్.

సీ. శరవేదనమున నా ♦ సర్వాంగ మెరియగ
దప్పిక బుట్టె పా ♦ తాళగంగ
గావలె శరతల్ప ♦ గతుడనై యునికి- న
న్యజలమ్ము సేవింప ♦ నన, మనుజులు
వెఱగంది పరికించు ♦ తఱి కవ్వడింజూచి
తేనేర్తువీవు వే ♦ తెమ్మనంగ
క్రీడి తాతకు బ్రద ♦ క్షిణము గావించి ప
ర్జన్యాస్త్రనామక ♦ సాయకమును స

తే. గీ. ధరణి గాడంగ నేసిన ♦ తత్క్షణమున
నెగయువారిధారల గ్రోలి ♦ తృప్తినందె
శాంతనవు డెల్లవారు వి ♦ స్మయులుగాగ
నంతలో [illegible]క బాంధవు ♦ డస్తమించె.

వ. అట్లు సూర్యాస్తమయం బగుడు నెల్లరు శిబిరంబుల కరిగిరి. తదనంతరంబ కర్ణుండు గాంగేయునికడకుం జని ప్రణమిల్ల భాగీరథీసుతుడు కౌగిలించుకొని రక్షకాదిజనంబుల నవలకుం బోవ బనిచి కానీనున కిట్లనియె.

తోడి - రూపకము

ప॥ నీయెడ గోపమ్మునాకు - నిజముగ లేదని నమ్ముము ॥నీ॥
అ॥ ప॥ దాయలకుం బగగొల్పుట - దగదని పల్కితిని గాని ॥నీ॥

చరణము

1. కౌంతేయుడ వీవుగాని - కావుజుమా రాధేయుడ వెంతయు
సాత్యవతేయుం - డియ్యది నాకెఱిగించెను ॥నీయెడ॥

ఉ. పాండుకుమారులా హరికి ♦ ప్రాణసముల్; విజయుం
డజేయుడాఖండలముఖ్య ♦ నిర్జరులకైనను; నిక్కువమట్లుగాన నీ
వొండుతలంపుదక్కి సమ ♦ యోచితరీతి సుయోధనాదులం
బాండవులన్ రణంబుడిగి ♦ భద్రగతిం జరియింప జేయుమా!

వ. అనిన విని కర్ణుం డిట్లనియె.

ఉ. కన్నియనాడు కౌంతికి వి ♦ కర్తను సత్కరుణ జ్జనించుటే
మున్నెఱుంగుదున్ గడచి ♦ పోయినదానికి నేడు లాభమే
మున్నది చింతసేయ, నెటు ♦ లో యిక యుద్ధముగాక తప్పదీ
యన్నవప్రాణ మాకుమతి ♦ రాధపుబా లొనరించితింగదా!

చ. అరయుదు పాండవేయులు మ ♦ హాబలులంచు, మురారి ప్రాపుగా
వరలునటంచు, వారిగెలు ♦ వం దర మేరికి గాదటంచు, ని
కురుపతి సేయుమన్ననల ♦ కుం దలయొగ్గిన నాకునెల్లునే?
పరమవిరోధులై పరగు ♦ పాండుకుమారుతోడి పొందికన్.

ఉ. మాటల జేతలన్ దురభి ♦ మానముపెంపున బాండవేయులం
జాటి పరాభవించితిని ♦ సంగర మిట్లు పొసంగునంత యీ

నాటికి సాటివాడనని ♦ నమ్మినసామిని మోసగించి నే
కూటికి గడ్డకై బ్రతికి ♦ కుంతికుమారుల జేరు టొప్పునే?

చ. సకల జనక్షయంబగుట ♦ సత్యము, సంగర మందు కేర్పడెం,
దికమక లెల్లవాపి జగ ♦ తీభర మెల్ల నడంప బుట్టె నే
వకిళొడు కింతసిక్కు-వము, ♦ వచ్చునొకో విధి సేత మాన్పగా?
యిక గరుణించి యాజ్ఞయిడు ♦ మే జని నాపని నిర్వహించెదన్.

వ. అని పలుక- కర్ణుని మనోనిశ్చయంబున కలరి దేవవ్రతుం డిట్లనియె.

శంకరాభరణము - రూపకము

ప॥ నీతిమంతు డీయుగమున - నీవొకండ వేకర్ణా ॥నీతి॥

అ॥ ప॥ జాతితోబనేమి? తలప - నీతిగదా వన్నెదెచ్చు ॥నీతి॥

చరణము

స్వామికార్యభారవహన - సామర్థ్య విశేషమందు
రామభక్తుడా హనుమడె - రాధేయా నీకు సాటి ॥నీతి॥

ఉ. శూరు లజేయులున్ వలయు ♦ సోదరులంచు పృథాకుమారు లీ
వారసియున్ సుయోధనుని ♦ యందలి నేస్తమునే గణించి నీ
పోరువిధంబు సర్వమును ♦ పూజ్యతగాంచు; ననుజ్ఞ నిచ్చితిన్
వీరవరేణ్య! పోమ్మనికి ♦ విశ్రుతకీర్తి వహింపు మెల్లెడన్.

వ. అనిపలుక- గాంగేయునకుం బ్రణామిల్లి కర్ణుండు నిజశిబిరంబునకుం
జనియె.



శ్రీ



# మహాభారతము

## పద్మవ్యూహము

బిలహరి - రూపకము

ప॥ అభిమన్యుడు పద్మవ్యూ - హము సొచ్చిన కథవినుడీ ॥యభి॥

అ॥ ప॥ అభవాదులకును వెన్నిడ - నట్టిజోదు కిరీటికొడుకు ॥కభి॥

చరణము

శరగురుండు పన్నిన మొ - గ్గరము నట్టె సించినాడు
అరిమర్దనత హరికి మే - నల్లుం డనిపించుకొన్నా ॥డభి॥

సీ. శరతల్పగతుడైన ♦ సురనదీ నందను
కొఱకు విచారించి ♦ కురువిభుండు
కర్ణాదియోధులం ♦ గలసి పాండవసైన్య
మునకు మార్కొన దల ♦ పోయినంత
తనసేన నడుపగా ♦ దగిన నాయకుడు ద్రో
ణుండని పల్కె గ ♦ ర్ణుడు, సుయోధ
నుడు కుంభజుండున్న ♦ యెడకుంజని మహాత్మ!
యఖిలసేనాధిప ♦ త్యమ్ము నిర్వ

తే. గీ. హింపు మీవే యటంచు బ్రా ♦ ర్థించి పావ
నోదకమ్ముల దెప్పించి ♦ యుచితరీతి
నపుడె యభిషిక్తు నొనరింప ♦ నస్త్రగురుడు
గోరు మెదియే వరం బన ♦ గురుపతియనె.

దర్బారు - రూపకము

ప॥ పట్టితెమ్ము ధర్మపుత్రు ప్రాణమ్ములతో నాకడకు ॥ప॥
అ॥ ప॥ ఇట్టిమోడ ఛాపకీవర - మిచ్చిపేసి గురువర్యా ॥ప॥

చ ర ణ ము

నీకారుణ్య విశేషమె - నిఖిలాభీష్టము లగూంగ్చ
నీకౌరవ సైనికులను - జేకొందు శుభము లింకిటు ॥పట్టి॥

వ. అనవిని ద్రోణుండు రారాజున కిట్లనియె.

చ. శమనతనూజు డెంతయు న ♦ జాతరిపుండను మాటలెల్ల ని
క్కములగు, నతని ♦ గంధ్యమునను వెగజూడ గోర కి
క్రమమున బట్టితెమ్మని తి ♦ రమ్ముగ గోరెదవే నృపాల! ప
లుకు మిపుడ నన్ను నీవిటుల ♦ గోరినకారణ మో సుయోధనా!

వ. అనిన దుర్యోధనుండు,

ఉ. అన్నను జంపుచో విజయు ♦ డల్గి మనున్ సమయించు, వారినే
తెన్నడనో వధించినను ♦ దేవకిపట్టి మనుస్వదించి కుం
తిన్గలబెట్టి రాణిగ, యు ♦ ధిష్ఠిరు జూదమున న్జయించి భా
గ్యోన్నతి నేలుకొందు భువి, ♦ నుగ్రవనమ్ముల కంపి వారలన్.

వ. అనిపలుకు దుర్యోధను కౌటిల్యమునకు ధనురాచార్యుం డేవగించు
కొనుచు నిట్లనియె.

చ. సురలకుసైతమున్ గెలుపు ♦ నున్న కిరీటియె నిల్చియున్న సం
గరమున, నాకుమాత్ర మెటు ♦ కవ్వడి నోర్వగనౌ? ధనంజయుం
డుగావడి నిల్చి యడ్డపడ ♦ కున్నను, దా వెనుసూపకున్న చో
స్థిరమిది, బట్టితెచ్చెద యు ♦ ధిష్ఠిరు నీకడకున్ సుయోధనా!

తే. గీ. అనినవిని కౌరవాగ్రజుం ♦ డలరె, గురుని
ప్రతిన చారులచే విని ♦ పాండవాగ్ర
జుండు వెఱగంది "నాయున్న ♦ చోటనిలిచి
సమర మొనరింపు" మన ధనం ♦ జయుడు పలికె.

ఉ. నవ్వులచేటుగాక ప్రతి ♦ నల్ నెఱవేర్చుకొనంగ శక్యమే?
కవ్వడి మేన ప్రాణములు ♦ గల్గిన ద్రోణుడె గాడు స్థాణుడున్
దవ్వుల నిల్చిచూచువలె ♦ ధర్మతనూజునకున్ బరాభవం
బెట్టవధిగల్గు? గల్గునెడ ♦ నేకముగావొకో? సప్తవారిధుల్.

వ. అని పలికి నిజబలంబు న్వెంటనిడుకొని రణభూమికిం జొచ్చి శత్రుబలంబుం దాకునంత ద్రోణుండు సెలరేగి పాండవసైన్యంబుపై దివ్యాస్త్రమ్ములం గురియించుచు నుదయించిన మార్తాండుబలె నేరికిం జేతిమీఁదరాక మిన్నకుండయ్యును కుమారమూర్తి నొప్పుచు ధనంజయ ధృష్టద్యుమ్నులతో పెద్దపెట్టుగ యుద్ధం బొనర్చునెడ నభిమన్యుండు కౌరవసైన్యంబుపైబడి నుగ్గుమాడుచు సైంధవప్రముఖులం బాఱఁదోలుచున్నంత రోషించి గదాధరుండై శల్యుం డభిమన్యు నెదిర్చిన నంతలో భీమసేనుండు మద్రపతి నెదిర్చిని బలద్వయమ్ము వెఱగంద మోహరించె నట్టియెడ ధనురాచార్యుండు [illegible] ధర్మసూనుపైబడి శరవర్షంబుం గురియింప విజయుం డడ్డుపడి ధర్మజుం గాచికొని సమరతలం బెల్ల మేదోమాంసపంకంబును శోణితనదీప్రకరమ్మును గావించె నమ్మఱునాడు సుశర్మాదులగు సంశప్తకు లనేకరథికముఖ్యు లర్జునుం దలపడి పోరుచున్నంత ద్రోణుండును పాంచాలురపైబడి నుఱుమాడుచు పాండవసైనికుల కందఱకు నన్నిరూపులై పోట్లాడునెడ నొకవంక భగదత్తుండు సుప్రతీకం బను తనయేనుగను పాండవసైన్యంబుపై గవియంజేసిన నయ్యది దూరమునుండి కని తేరటు పోనిచ్చి భగదత్తు నెదిర్చినంత నా ప్రాగ్జ్యోతిషాధీశ్వరుం డింద్రనందనుపై వైష్ణవాస్త్రంబుం బ్రయోగింప వాసుదేవుం డయ్యది తన యురంబున ధరించె నంత క్రీటియు దంతిని భగదత్తునిం బరిమార్ప, మూడవనాడు ద్రోణుండు పద్మవ్యూహమ్ము సంఘటింప నర్జునుండు ధర్మరాజరక్షణార్థమై భీమాదులనుంచి తాను త్రిగర్తులతో యుద్ధమ్ము సేయుచున్నంత నిట ధర్మజుండు తత్పద్మవ్యూహమును భేదింపనేరక సౌభద్రుం బిలిపించి యిట్లనియె.

తోడి - ఆది.

ప॥ కయ్యమాడ జనుదెంచె త్రిగర్తుల-గవిసి నీతండ్రి నేఁడు నాతండ్రి॥క॥
అ॥ప॥ అయ్యవారు నన్బట్టి యిత్తునని-యభయ మొసగి రా సుయోధనునకు

చ ర ణ ము

గురుఁడు నేఁడు ప్రళయోగ్రుఁడై వెలుఁగు-నెఱుఁగ వేమియు నాకీ గూఢ దోఁచదు
పరువునిల్పు మీపాండుకుమారులు బవరమున్న వెనుదీయకుండుమువడి॥క॥

చ. హరియును క్రీడిలేనితఱి ♦ నస్త్రగురుండు రచించె తమ్మిమొ
గ్గర మదిమాకభేద్యమగు ♦ గావున నిన్బిలిపించినాఁడ నే
వెరవున నొడ్డుసించి రిపు ♦ వీరుల గర్వమువాపి పాండుభూ
వరుని యశమ్ము నిల్పెదవొ? ♦ భారము నీయది సుమ్ము నాయనా!

ఉ. అయ్యకు దీసిపోవు రణ ♦ మందు రవంతయు నీవు, గాని "మీ
రెయ్యెడ బోరి కంపవల ♦ దేను సమీపమునందు లేని చో
నియ్యభిమన్యు" నంచు వచి ♦ యించె ధనంజయుఁడొక్క-నాఁడు మా
కయ్యది నెమ్మనమ్మునకు ♦ నాగటముం గలిగించు నాయనా !

వ. అని పలుకునంతలో బకవైరి బాలుంగని,

ఉ. "సొచ్చుటెగాని వెల్వడుట ♦ సుంత యెఱుంగని కుఱ్ఱఁడంచు" నా
క్రుచ్చసుభద్ర; "కూల్చెద వి ♦ రోధుల నాపెదతమ్ము డింతలో
వచ్చునటంచు" జెప్పి గొని ♦ వచ్చితి నిన్నిట దాఁచిపూఁచి సం
దిచ్చినజాలు శాత్రవుల ♦ నేబడ గూల్తు గదాధరుండనై.

వ. అనిన విని యభిమన్యుండును.

చక్రవాకము - ఆది.

ప॥ నన్నింతగ బతిమాలగా వలయు-నాయేమి మీరలో తండ్రులార॥
అ॥ప॥ అన్నన్నా! యని సేతకీకరణి-యాండు సాంద్రయంగీకృతివలయున॥

చ ర ణ ము

కలనైనన్ గలనన్న వెఱతు నే-విలుకాడగు నా క్రీడికొడుకునై
పులికడుపున లేడికూన పొడమునె-పుట్టినయది రాచపుట్టువే కద॥న॥

సీ. శరనిధిం దరుగు మం ♦ దరసగమ్మునిధాన
కాననమ్మున రేగు ♦ కారుచిచ్చు
కైవడిం గాల ప ♦ క్ష్వజనసమాజ సం
హరణక్రీడనం ♦ బాచరించు
శూలిపోలిక బహు ♦ కేళీగతుల నొప్పి
కురుసేనపైబడి ♦ యురవడించి
కేతువులం గూల్చి ♦ యాతపత్రమ్ముల
నుఱుమాడి తేరుల ♦ నుగ్గుజేసి
తే. గీ. గజహయములఁ సూతుల ♦ గీటడంచి
కాల్బలమ్ముల జదుపగ ♦ కౌరవాగ్ర
జుండు సౌభద్రుసిం దాక ♦ జూచి ద్రోణు
డెల్లసైనికవరుల కె ♦ ల్లగ్ని పలికె.

మోహన — రూపకము

ప॥ చూతురేమి? యభిమన్యుడు-సుయోధనున్ దాకుచుండ ॥చూతు॥
అ॥ ప॥ ఆతడర్జునాత్మజుడగు - నర్భకు డనుకొంటిరేమొ ॥చూ॥

చరణము

పరజనదుర్భేద్యంబగు - పద్మవ్యూహంబీగతి
నరనిముసములో సించుట - యైనజూడగా! యూరక ॥చూ॥
చ. అని పురికొల్పుచుం గవిసె ♦ నయ్యభిమన్యుని ద్రోణు, డంతలో
మునుకొని కర్ణశల్యకృప ♦ ముఖ్యులు పల్వురు చుట్టుముట్టి, రా
యనిమిషరాజపౌత్రుడు ర ♦ ణావని సందరి కన్నిరూపులై
తనరుచు నీరసంపఱచె ♦ తత్కురుసైనిక వీరవాంఛమున్.
సీ. కవచమ్ముదూఱి యం ♦ గము గాడిపో నేయ
తొలగె సూతసుతుండు ♦ నిలువలేక
వాడితూపుల తాకు ♦ వడి బిట్టలసి యట్టె
మూర్ఛిల్లె నామద్ర ♦ భూవరుండు
విలుద్రుంచి మేనికిండలు ♦ సెక్క నాగున్న
సేనుండు పడె సొమ్మ ♦ సిలి రథమున

శిరము కుండలకాంతి ♦ జెలఁగ లక్ష్మణకుమా
రుండు నేలంబడి ♦ యసువుమాసె

తే. గీ. పేర్వడిన యోధులెల్లరు ♦ విరథులైరి
కదనమేదిని నెత్తుటి ♦ కాల్వలయ్యె
నంత నపరాహ్ణసమయమ్ము తే ♦ రస్త్రగురుని
పైకి దోలించి కురుపతి ♦ పల్కె నిట్లు.

ఉ. పట్టెనయొసంగుఁడాఁ గవఁ ♦ పార్థుఁడు లేనెడ ధర్మపుత్రు నం
చొట్టెదుకొంటి వేగద! సు ♦ యోధనుతోఁడుత గాచికొండు నే
పట్టెనయొసంగుఁడాఁ గురుప్ర ♦ పాలుని నాపెదతండ్రినిష్ఠు నీ
యుట్టి ధనుర్విదగ్రణుల ♦ నందఱఁ గెల్చి మహీసురోత్తమా!

వ. అని పల్కి రారాజు పయిం గవియు గురు కృప కర్ణాశ్వత్థామ శల్య దుశ్శాసనాదులెల్ల దోకొ పెట్టిన సౌభద్రుపైబడ నతం డెల్లరం గాండిశీకులం గావించుచున్నంత దుర్యోధనుండు ధనురాచార్యుని పాలికిం జని,

కేదార - ఆది.

ప॥ కప్పకూతభుజగంబనై యిట్లు - కౌరవపక్షమునందు జేరితివి ॥కప్ప॥
అ॥ప॥ ఎప్పుడు పాండవపక్షపాతివే-యెఱిఁగి మోసపోయితిని బాపడా॥

చరణము

బాలుడెట్లు మొగ్గరము భేదింప - జాలు నీవుపేక్షించితివిగాక
నీలావు న్నేరనమ్మి లక్ష్మణుని-గోలుపోతి కులవర్ధనుడగు సుతు ॥క॥

వ. అని పలుక దుర్యోధను నేవగించుకొనుచు కర్ణాదులంగని ద్రోణుం డిట్లనియె,

చ. అలతులఁబోవఁడీ బుడుత ♦ డర్జునతుల్యుఁడు, చేత గార్ముకం
బలరిన యంతదనక నిట ♦ లాతునకైన నజేయుఁ డెట్టులో
విలు దునుమాడి వెస్వరిమి ♦ వే విరథుంబొనరింపు డందఱుం
దలపడి యొక్క-పెట్టున ప ♦ దంపడి గూల్పగవచ్చు నీతనిన్.

చ. అనవిని కర్ణుఁడు న్వెనుక • కల్లన వచ్చి సుహాసుగమ్మునన్
ధనువును ద్రుంచె, వాజులబ ♦ దంపడి గూల్చె గురుండు, సారథిం
దునిమె గృపుండు, సౌబలుఁడు ♦ ద్రోణసుతుండును శల్యుఁ డాదిగా
దనరు మహారథుల్ శరవి ♦ తానమునం గడు నొంచి రాయ్యనన్

వ. అంత నాక్రీడికొడుకు వాలుంబలకయుం గొని నైసతేయునిమాడ్కి నింగికెగయ దళాన్వధనమ్ముల ద్రోణరాధేయులు తుత్తునియలు గావింప సౌభద్రుండు తన తేరిపైగల చక్రముంగొని యుపేంద్రు ననుకరించుచు సమరావేశుండై,

సీ. కలయబూచిన కింశు ♦ కములీల నెమ్మేసి
రక్తారుణప్రభల్ ♦ రచ్చకెక్క
చక్రరోచులు మణి ♦ స్థగితకంకణకాంతు
లంబరవీథి మే ♦ లంబులాడ
సింహనాదము వైరి ♦ సేనాపయోనిధి
నల మందరాచల ♦ మై మథింప
ప్రథితవిక్రమ విహా ♦ రము రత్నహారమై
భరతమాతకు వన్నె ♦ బాదుకొల్ప

తే. గీ. ద్రోణుపైబడి తన్నడ్డు ♦ సైనికులను
చించి చెండాడుచున్ దున్న ♦ సేనతనయు
తోడ బోరాడి పోరాడి ♦ క్రీడికొడుకు
కడకు దౌశ్శాసనిం గూల్చి ♦ పుడమి బడియె.

క. అదివిని ధర్మతనూజుడు
హృదయము పగులంగ చేష్ట ♦ లెడసి యొకంతన్
గుదురువడి సుతవియోగము
నెద సైపగలేక యేడ్చె ♦ నీవిధి సంతన్

ముఖారి - జంపె.

ప॥ నినుచేతులార నే - ననికంపి జంపించుకొన నాయెనా
నేటికి - నేకొంతుడను నాయన ॥నిను॥

అ॥ ప॥ నినువంటి కొమరుని నె - న్నజన్మములనె త్తి
గనజాలుదునె నీకు నూరేండ్లు నిండెనా ॥నిను॥

చరణము.

ఎనుగురాడేమి యభిమన్యుఁ డేడియంటంచు
గదిసి యడుగుడు కిరీటికి - నే నేమనినను వృధా ॥నె॥
కదనమున ద్రోణాదిగురుల - వెనుజూచు నీ
వదన మీనాటితో - గన నోచమైతిమా ॥నిను॥

చ. కులమును నిల్పగాదగిన ♦ కుఱ్ఱడె వాఁడనినమ్మి క్రీడి యా
కిల నొనరించునట్టి నిను ♦ గయ్యమునం దెగజూచి తొల్తనే
బలము జలంబు జూపి పగ ♦ వారివధించి యికేమి బ్రాముకో
దలచి రణమ్ము నేత కిక ♦ దాము గడంగుదు రయ్య పాండవుల్?

చ. కొనకు సుభద్రకుం గడుపు ♦ కోత, మురారికి జింత, యుత్తరా
వనితకు దీఱరాని వెను ♦ వంత, కిరీటికి పుత్రశోకముం
బొనరిచినట్టి యీపెనటీ ♦ బొందియు బ్రాణము వాయదేల? పా
పునకు చిరాయువన్న నుడి ♦ పొల్లగునే? విధినేత దప్పునే?

వ. అని వలపించు ధర్మసూనునికడకు పారాశర్యుండు సనుదెంచి దుఃఖోపశమనం బొనర్చి సనునంత సాయంసమయమునకుఁడు పోరు సాలించి కృష్ణార్జునులు శిబిరమ్ముదెసకు వచ్చుచో నర్జునుండు గోపాలుంగని,

ధన్యాసి - ఆది

ప॥ కలగుమానసముదుర్నిమిత్తములె గన్పట్టెడు నామేనుద్రిమ్మపడిమె
అ॥ ప॥ తలపనిద్దానికేమి హేతువో - తెలియజాలబాహాలోకేశ్వర ॥కల॥

చరణము

అన్న లేమైరో? తమ్ములెట్టియా - పన్నులైరో యాచార్యునికతమున
కన్నుగవకు గానంబడు వెలవెల - నున్నయట్లు శిబిరము గోపాలా ॥క॥

తే. గీ. రణము సాలించి నే శిబి ♦ రమ్ము జేర
వచ్చునపుడెల్ల నేత్రప ♦ ర్వమ్ము గాగ

నెగురుసను చెంచి నను కౌగి ♦ లించు కొడుకు
నేడు గృహతోరణమ్మున ♦ లేడు, కృష్ణ!

వ. అనిపలుకుచు నడుగులు తొట్రుపడ ధర్మజుఁ డెదల కరిగి వారిలో నభిమన్యుఁడు లేమిం జూచి యిట్లనియె.

క. గురుడు రచించిన మొగ్గర
మొరులకు జొరరా దటంచు ♦ నూహించి యటన్
ద్వరపడి సౌభద్రుని పం
పరుగాదే తెలివిమాలి ♦ బవరమున కేయన్?

క. అనిపల్కి నిరుత్తరుడై
తనయా! యనుచేడ్చు ధర్మ ♦ తనయుని యాక్రం
దన మాకర్ణించియు ని
ల్చిన గూలంబడి కిరీటి ♦ పొగులదొడంగన్.

సింహేంద్రమధ్యమము - త్రిపుట

ప॥ పుడమియంతయు నేలుదీవని - పుట్టెడాస వహించి యుంటిని ॥పు॥

అ॥ప॥ కొడుక? నీవిటు గూలినాడవ-కుతుక మాఱడి బుచ్చినాడవ॥పు॥

చరణము

వరలు పున్నమచందురున కైన - వచ్చు నీ వదనమ్ము జూడక
ధరసుభద్రార్జునుల కేగతి-తనువులం బ్రాణములు నిలుచును ॥పు॥

ఉ. దైవతకోటికిం బ్రభుడు ♦ తాత బిడౌజుడు, కన్నతండ్రి గాం
డీవి, జగన్నియామకుడు ♦ నీరజనాభుడు మేనమామ, స
వా వివిధాస్త్రసంచయ ని ♦ దగ్రణి నీగతి దక్కుమాలి యు
ద్ధావని గూలినావె విప ♦ దంబుధి ముంచి మముం గుమారకా!

వ. ఇట్లు పలవించి సేయునదిలేక యమ్మేడం బొడమిన కోపావేశమ్మున నచటి వారిం గని.

ఉ. నందను గాచియుందురని ♦ నమ్మి త్రిగర్తుల గెల్వబోవ మీ
రందరు నాడువాండ్రవలె ♦ నర్భకు నొంటిగనంపి యూరగతిన్
బ్రమందగ జేసి రిట్టి యన ♦ మర్థులు మైమఱువుల్ కృపాణముల్
అందము లోటుగాంచుననియా! తగువారమటంచు దాల్చుటల్

తే. గీ. అకట! ముకుపచ్చలారని ♦ యట్టిపాని
బదియునాఱేండ్ల బాలు కుం ♦ భభవకర్ణ
ముఖ్యుల నెదిర్చి పోరాడి ♦ మొగ్గరమ్మ
సింహ బంపి చంపించిన ♦ చెనటి యెవడు?

వ. అనిపలుకు- విజయుని శిబిరమ్మ వెల్వడి ధర్మజుండు సమీపించి.

చ. హరియును నీవు లేనితఱి ♦ సత్రుగురుండు రచించినట్టి మొ
గ్గరము ప్రవేశమున వెరవు ♦ గానక బాలకు నంపినట్టి ము
ష్కరుడను కులాంతకుండను సుతా ♦ ఘాతి వివేకవిహీను డీతడే
శిరము సముత్తరింపు మిక ♦ చచ్చెద పున్నెముగామ్మ తమ్ముడా

క. అనిపలుకు ధర్మనందను
వనజాక్షుం డూరడించి ♦ పార్థున కనె నీ
తనయుని తెగుటకు హేతువు
కనుగొన సైంధవుండు, వాని ♦ గడతేర్పుమికన్.

వ. అనిపలికిన విని వివ్వచ్చుండు పుత్రఘాతియగు శత్రుని వధంబునం గాని శోకం బుపశమింపదని తలంచి యెల్లరు విన ధర్మసంభవునితో నిట్లనియె.

పూర్వికల్యాణి - ఆది.

ప॥ చంపుదు నా సైంధవు నెల్లి యిదియా -
సలుపు ప్రతిన యన్నా ... చీకటిపడకమున్న ॥చం॥

అ॥ప॥ చంపలేకున్న గాండీవమ్ముతో - జ్వలనజ్వాలల భస్మమైపోదు॥చం

చరణము

నిన్ను శరణుజొరకున్న గావుమని - నీరజాక్షు నొగి ప్రార్థింపకున్న
వెన్నుజూపి చనకున్న సురాసుర వీరులడ్డమై వచ్చి కాచినం ॥చం॥

తే. గీ. అనిపలికి గాండీవమ్మున ♦ జ్యంబొనర్చి
నారి మ్రోయించి శంఖని ♦ నాద మెల్ల
దిక్కుల న్నిండజేయ భీ ♦ తిగొని యిట్లు
సింధుపతి కౌరవేంద్రుతో ♦ జెప్పుకొనియె.

ఉ. అందఱుగూడి సంపిరి కదా ♦ నా యభిమన్యుఁ, బలాగ్నిసూతి న
న్నిందగఁ జేతు నంచుఁ బ్రతి ♦ నఁ బొనరించె నిదేమి పాపమో?
బందుగు లస్త్రకోవిదులు ♦ పల్కుదు రన్నిట నీవి సాటిసా
మ్మందరొ? రక్ష సేయగల ♦ మానవు లెవ్వరో? మీ రెదిరించిని ముందుగన్.

వ. అని వెఱచు సైంధవుని భుజము తట్టుచు సుయోధనుం డిట్లనియె.

సీ. విలుకాండ్రకున్ మేటి ♦ కెలనూనికరంబన్న
ఖ్యాతిగాంచిన యట్టి ♦ కర్ణుఁడుండ
బహుళాస్త్రశస్త్రసం ♦ పన్ను లీగురుకృపా
శ్వత్థామ ముఖ్యులా ♦ చార్యులుండ
నలఘువిక్రమధురీ ♦ ణులు శల్య సుబలరా
జాత్మక సోమద ♦ త్తాదులుండ
బాంధవమ్ములకు నీ ♦ బావమఱఁదు లై
నుతిగన్న యోధులు ♦ నూర్వురుండ

తే. గీ. పేర్వడిన వీరవరుడనై ♦ విజయు ప్రతిన
దలచి నీవింత గుందగా ♦ దగునె? చెపుము,
మా మఱువుసొచ్చు నిను సుర ♦ స్తోమముం గ
డంగి కనువిచ్చి తేఱిచూ ♦ డంగ వశమె?

వ. అనిపల్కి ద్రోణుచే నభయమిప్పించి యాతని సైన్యమ్ము వాపె నట నర్జునుండును మాధవోపదేశమ్మున నిజసదనమ్మున కరిగి పాదప్రక్షాళనమ్ము గావించుకొని దర్భశయ్య గావించి గంధపుష్పాక్షతమ్ముల నలంకరించి యాయుధమ్ము లర్చించి నాటిరేయి స్వప్నంబున శంకరు ధ్యానించి కృష్ణసహితమ్ముగ గగనమ్మున కెగసి యుత్తరాభిముఖుండై చని కైలాసమ్ము జేరి పరమేశ్వరు నభినుతించి పాశుపతం బర్థించి దానిం బ్రస్ఫుటమ్ముగా బడసి మరల నిజశిబిరంబు సొత్తెంచి నట్లుగని కొంతవడికి మేల్కని సూర్యోదయమ్మునకు వేచియుండె.



# మహాభారతము

## సైంధవవధ

మోహన - రూపకము.

ప॥ వినుడు సభాసదులారా - వినిపించెద సైంధవవధ ॥వి॥

అ॥ ప॥ వినవిన జవులూరు భరత - వీరుల సచ్చారిత్రము ॥విను॥

చరణము

తేరుగోలుకొని హరిరా - నారోహించెను కిరీటి
మేరు శిఖరమున దినమణి - తీరున దాశోభిల్లుచు ॥విను॥

సీ. ధర్మజరక్షణా ♦ ర్థము సాత్యకి న్నిల్పి
కదల కపిధ్వజ ♦ కాంతులీన
సంగరోత్సాహుడై ♦ శంఖమ్ము పూరించి
ప్రకటగాండివ గుణ ♦ ధ్వని నొనర్చి
పైబడు యోధులం ♦ బడనేయుచు గజాశ్వ
వితతి గూల్చుచు మహా ♦ వీరమూర్తి
యై కురుసైనికుల్ ♦ హరిగన్న లేళ్ళపో
లిక భీతి నల్దిక్కు ♦ లకును బాఱ

తే. గీ. శరగురుండు రచించిన ♦ శకటనామ
కోజ్వలవ్యూహముం జింప ♦ నొడ్డుసేరి
ద్రోణు గన్గొని నిలిచి చే ♦ తులు మొగిడ్చి
యనిమె భయభక్తులెసగ జం ♦ భారిసుతుడు.

శ్రీరాగము - ఆది.

ప॥ మొగ్గరమ్ము భేదింతు నాజ్ఞయిడు - మగ్గలంపు ప్రేముడి గురువరా॥
అ॥ప॥ అగ్గిచూలి కెనవచ్చు సేనాని - వ్యగ్రతేవాసిని సీరు, గాన సి ॥మొ॥

చ ర ణ ము

పెనిచితీపు సరికూర్మి సిలెనయుము - ననుకరుణ నన్నిన్నిపోషమ్ముల
కనుక నాప్రతిన నెఱపు మీఁవేళ-కరుణింపుము నన్నింపు మాయిత్తివ్వలని

ఉ. పాండువిభుండు, ధర్మజుడు, ♦ పంకజనాభుడు, సిస్సుగాక యా
ఖండలసూతి కెన్నడును ♦ గాడు మహాత్మ్యము మేలుపోసి యా
డొండుదలంప కీవు నను ♦ యోపితపతి ననుగ్రహింపు మా
వ్వెండు భవన్నిశాతశర ♦ వారము నోర్వగలాడు? కుంభజా!

చ. అనవుడు పిన్ననవ్వొలయ ♦ నస్త్రగురుండను, నన్నుగెల్వ నీ
యనువున సైంధవుం గదిసె ♦ దంచు మురారిని గ్రీడి సమ్ములన
మునుగగ నేయగా నడుమ ♦ నుగ్గొనరించి యతిక్రమించి మా
ర్వని వికలమ్మొనర్చి పర వీర ♦ బలమ్ముల నేర్చి, క్రీడయునన్.

చ. కరుల నడంచి సైనికుల ♦ గ్రన్నన గూల్చుచు ద్రోణుతోడి సం
గరము నిరాకరించి యొడి ♦ కమ్మగ మొగ్గరమ్ము ద్రెంచి పో
సరక శ్రుతాయుధప్రముఖ ♦ సైనికులం దెగటార్చి, నాపయిం
గురుపతి తేరు దోలుకొని ♦ కుంభజుపాలికి బోయి యిట్లనన్.

భైరవి - రూపకము

ప॥ తేనియపూసిన కత్తివి - తెల్లమయ్యె నీనడత ॥తేని॥
అ॥ ప॥ మాన వెన్నిభంగుల నీ - మత మీ పాండవపక్షము ॥తేని॥

చ ర ణ ము

బలరిపునందనున కోడి - ప్రాణభీతి సైంధవుండు
తలదాచుకొనె నన్నుకడ - తన్నే మొనగాతుమంచు ॥తే॥

చ. వెలవెలబాఱజొచ్చె నృప ♦ వీరగణమ్ము కిరీటిరాక నీ
వలుగకుమయ్య నానుడుల ♦ కార్తిమెయిం బలుమాటలాడితిం
గలన పురారికేనియును ♦ గానగదా నిను మాఱొడ్డనంగ నే
వలము దయాపరుండవయి ♦ పాలనసేయగదే జయద్రథున్.

వ. అనవిని భారద్వాజుండును.

మ. కవచంబొండు ధరింపు మిచ్చెద కురుక్ష్మానాథ! యుద్ధాన శా
స్త్రవనిర్ముక్తకరాళి నీతనువునన్ ♦ దన్యమ్ముగా దాక దీ
యవకాశమ్మున కవ్వడిం గెలుతువ ♦ య్యా! యింక నేనుండి పాం
డవసేనంగలగింతు భద్రముగ ♦ దీనన్ సింధుభూజానికిన్.

వ. అనిపల్కి తత్కవచమ్ము సమంత్రకమ్ముగ సుయోధనునకుం దొడిగి దీవనలిచ్చి యంపె వికర్ణ వివింశతి చిత్రసేన బాహ్లిక దుశ్శాసన శల్య శకుని సోమదత్తాదులం గలసి భీమ నకుల సహదేవ ఘటోత్కచ ధృష్టద్యుమ్న సాత్యకి ప్రముఖులతో ప్రచండభంగిం బోరాడుచున్నంత నక్కడ గాండీవి సైంధవుం డున్న దెసకుం బోవుచు విందానువిందులను మహావీరుల ద్రుంచి యసంఖ్యాక రథగజతురగపదాతిబలంబులం గూల్చుచు గురుసేనం గనుపుకొట్టి నవ్వు కవ్వడిం గని గోపాలుండు రథాశ్వమ్ములు డప్పిగొని డస్సి యున్నవననా సవ్యసాచియు,

తే. గీ. దివ్యశరసంహతుల ధరి ♦ త్రిం బగిల్చి
కొలనుగల్పించి యిలుగట్టి ♦ మలుకులగమి
హయముల న్నిరుద్రావించి ♦ యరదమెక్కి
వచ్చె రిపువీరవరులు చే ♦ వతలు బొగడ

చ. కలరు కృపాదియోధు లట ♦ గాని యొకండును జేరబోవ డా
బలరిపుసూను నబ్బురము ♦ బైకొన జూచెద రంతెగాని కే
వలము గతాశులైర కురు ♦ వర్యులు సైంధవుపట్లు నంతలో
నిలిచి రణావనిం బలికె ♦ నేరుపుమై కురురాజు క్రీడికిన్.

బాగు - ఖండగతి

ప॥ మేటివిలుకాడవను - మాట లీనాటితో
బూటకము గావింతురా - వేల్పుతేనికొడుకా ॥మే॥

అ॥ ప॥ నేటిపోరాటమున - నీపస గనంబడెను
నే లేనిచోట మును - నీకుబిరుదము సెల్లె ॥మే॥

నెచ్చెలియు న్గురుండుగద ♦ నీకు గిరీటి, బిరాన నేగి వి
వ్వచ్చుని గాంచుకొమ్ము బక ♦ వైరియు తోడగు నీకు నవ్వలన్.

క. అని పల్కిన విని సాత్యకి
చని కౌరవబలములెల్ల ♦ నదుముంచుచు ద్రో
ణుని దాకి పోరి కడ కా
య్యన లోనికి నేరె నొగి మ ♦ హానీకుండై.

సీ. కృతవర్మ సత్వక ♦ సుతునితో బోరాడి
వారింపగా లేక ♦ పాఱిపోయె
జలసంధు డను ధరా ♦ జాని శైనేయుతో
సమరమ్ము గావించి ♦ సమసిపోయె
నడరి సుదర్శనుం ♦ డను ఱేడు సాత్యకి
తో యుద్ధమొనరించి ♦ పోయె దివికి
శినివరుతో దుస్స ♦ సేను డాలమొనర్చి
చేవసాలక కాంది ♦ శీకుడయ్యె

తే. గీ. విజయుపోల్కి మురాంతకా ♦ నుజుడు బెక్కు
యోధులం గెల్చి పోరాడు ♦ చుండునంత
ధర్మజుండంప బకవైరి ♦ దర్పమెసగ
తరలి సేనాముఖమ్మున ♦ గురుని గవిసె.

క. కవిసిన భారద్వాజుం
డవురా! నీవెట్లుపోదు ♦ వనుమతి గొనకే
భవదీయానుజు డెటు సనె
నవలోకింపవా? యటన్న ♦ ననిలజు డనియెన్.

మోహన - ఆది.

ప॥ ఎన్నడీ యేచ్చి విందుజేయించు ♦ కొన్న రీతి మాటాడ నేర్చితి ॥వె॥
అ॥ప॥ పున్నెమునకు బోనిత్తు పేనన్ను పన్నిన మొగ్గర మందు కేర్పడెన ॥ఎ॥

చరణము

కాడు వీడు జేజేరాకొమరుడు - కదన భీముండు భీముండుగాని
చూడమిచటగురుడని దైవంబని-పాడియెఱుంగక పల్కెదొ బాపడ॥యె॥

వ. అనిపల్కి వృకోదరుండు విన్ననిమొగంబుతో సవ్యసాచి కడకుం జనియె. సాత్యకియు కురుబలంబుల నేర్లాడుచు గడకు భూరిశ్రవునితోఁ బెనంగి పోరు నెడ నయ్యిరువురకు గొంతవడికి పాదచారులై మల్లయుద్ధం బొనర్చునెడ భూరిశ్రవుండు పెద్దయుం బ్రొద్దుపోరి డస్సియున్న కృష్ణానుజు నేల బడవైచి మొగసి యురంబు నిరుగాలం ద్రొక్కి కృపాణమ్మున కంఠమ్ముం దునియ నేయుచున్నంత గోపాలుండది కని వేగిరపడి యర్జునుం గాంచి,

శా. నీకుం దోడ్పడవచ్చి నాయనుజు డేం ♦ తేడస్సి భూరిశ్రవుం
డాకంజాలక సైంధవాని గురవ ♦ స్థంబొందుచోఁ జూతువే
లా? కంఠం బిపుడుత్తరింప గదనా ♦ లంబెత్తె, వే ద్రుంచు మో
యీ కౌంతేయ! కరం, బన న్విజయు డ♦త్యుగ్రుం జెతద్బాహువున్.

తే. గీ. తునిసిపడి బాహువు భుజంగ ♦ మన జెలంగె;
నతడు గాండీవికనె 'తగు ♦ నయ్య! నీకు
జలజనాభుని దూరుపదే ♦ శమున జేసి
పరునితోఁ బోరు నన్నేయు ♦ టరయ, పార్థ!'

వ. అనవిని విజయుండును,

ఉ. దూఱెద వేలనన్నిటులు? ♦ తోడ్పడవచ్చి బిరాన గాచికో
నేరని మీ బలాధిపుల ♦ నిట్టొగి దూఱుము, ధర్మమున్నచో
మారసమాను నట్టి యభి ♦ మన్యుకుమారుని గూల్తురో కొ? తా
ర్మారగు ధర్మముల్ దురభి ♦ మాని సుయోధను కారణమ్మునన్.

మంజరులు

అనిన నిరుత్తరుడై భూరిశ్రవు - డపసవ్యకరమ్మునను
రణభూమి శరమ్ములు పఱచుకొనుచు - బ్రాయోపవేశమునను
ప్రాణాయామపరుండై యుండగ - బరికించి శినివరుండు
చేనున్న కత్తితోఁ జేసె శిర - శ్ఛేద మమితకోపుండు"

క. అదిగని రాధేయుండ
య్యదనున శైనేయు దాక ♦ నత డాకర్ణుం

బదానగు నారసముల జే
కొదవగ గొట్టంగ శాతా ♦ నొంచువలనికిన్.

వ. అట్లు పలాయనుండై కొంతవడికి కవ్వడినెగఁ ద్రోచి నరిగి కిరీటి రాధేయున కిట్లనియె.

కాంభోజి - రూపకము.

ప॥ ఏటికి భీముఁ గదూఱితివి - ఓహో సాత్యకి గెలువఁగ ॥ఏ॥
అ॥ ప॥ ఓటమియు నాగొప్పు గెలుపు - యుద్ధములో నెట్టఘనులు ॥ఏ॥

చరణము

అలతిపై బకాంతకు నీ - నాక్షేపించితివి గాని
తులువా నీకులము గుణము - తోఁచెఁ బ్రజకెల్లరకును ॥ఏ॥

ఉ. పాడిదొలంగి చేతివిలు ♦ భగ్నమొనర్చి మదాత్మజాతు నా
న్మాడిరి నేను లేనిసమ ♦ యమ్మున; దానికి నీవుసూడఁగా
పాడిమెయిన్ ద్వదాత్మభవు ♦ భవ్యశిర మ్మొకవాఁడికోల నా
న్మాడుదు, నిన్ను భండనము ♦ నన్ బలిపెట్టుదు భారతాంబకున్.

వ. అనిపల్కి కర్ణుందరిమి తనుఁగ్రంగల సైనికులపైఁబడి యొట్టుచు చున్నంత సుయోధనుండు రాధేయున కిట్లనియె.

చ. చలమున భీమసాత్యకులు ♦ సాయము రాఁ విజయుండు సింధుభూ
తలపతి యున్నవంకకటు ♦ దర్పమునం జనుచున్నవాఁ డదే
జలజహితుండు గ్రుంకుతఱి ♦ సన్నిహితం బగునంతదాఁక
యలవు బలమ్ముజూపి మఘ ♦ వాత్మజు నెట్టులో నిల్వరింపుమా.

వ అనిన విని కర్ణుండును,

చ. వడముడి వాఁడితూపులకు ♦ బాల్పడి దేహము చాలనొచ్చె ని
య్యెడ, నగుగాక, నాతను వ ♦ ధీనము జేసితినీకు గాన క
వ్వడి నెటులో వికర్తనుఁడు ♦ పశ్చిమశైలము జేరునంతకుం
గడిమిదలిర్ప నిల్పుదును ♦ కయ్యమునం దిటుపై సుయోధనా!

వ అని పల్కి,

చ. జలరుహమిత్రనందనుఁడు ♦ సైనికులం బురికొల్పి కవ్వడిం
దలపడి విక్రమం బెసగ ♦ దారుణభంగి రణంబు సేయుచో
బలరిపునందనానలుఁడు ♦ వైరికులాటవి గాల్చుచుండ నా
జలరుహనాభుఁడిట్లనియె ♦ సంగడికానికి కూర్మి క్రీడికిన్.

ఆరభి - ఆది.

ప॥ కనుగొంటివె పార్థా! నీరజారి - దినకరుఁ డా
యస్తాచలసీమకు ॥కను॥

అ॥ ప॥ పెనగులాడ జన - దింక పిడితో
దునుమాడందగు - సైంధవుశిరమును ॥కను॥

చరణము.

పాశుపతము వింటనన్నంధింపుము - పార్వతీశుని నెద ధ్యానింపుము
నేనుపాయం బొందుఁగల్పింతు - నీసల్పిన ప్రతినం జెల్లింతును ॥కను॥

చ. మఱుఁగుపడం బొనర్తు రవి ♦ మండల మేనొకమాయఁజేసి చూ
పఱకు తమంబుగుం బ్రబలిన ♦ భంగము నెందెనటంచు సింధు భూ
వరుఁడును కౌరవప్రకరము ♦ వాసి యథేచ్ఛగ సంచరింతు రీ
వెఱవున సైంధవుం దునిమి ♦ వేగ కృతార్థుఁడ వౌదు నర్జునా!

వ. అనిపల్కి మాధవుండు మాయాతిమిరంబున తిమిరారిం గప్పిన,

తే. గీ. తరణి గ్రుంకె నటంచు సైం ♦ ధవుఁడు తేరి
పైని నిలుచుండి తలయెత్తి ♦ పడమటిదెస
జూచుచున్నంత సురరాజ ♦ సూను డొక్క
సాయకమ్మున వాసి మ ♦ స్తకము దునిమె.

వ. అప్పుడు సత్వరుండై శ్రీహరి పార్థుంగని,

చ. ఇలఁబడరాదు వాని శిర ♦ మింపుగ నేఁటు లాకసమ్మునన్
నిలువు మటన్న క్రీడియును ♦ నేర్పున బంతివిధాన ద్రిప్పుచున్
ములుకుల మొనపున న్నభము ♦ ముట్టగ గొట్టుచు నెంతకాల మీ
నిలుపుట పల్కవే యనిన ♦ నీరజనాభుఁడు క్రీడికిట్లనెన్.

తే. గీ. ఏమఱిఁగి వీని శిరము ఖం ♦ డింపబడు న
టంచు నశరీరవాణియు ♦ న్నానతీయు
ధరణి బడనేయు వీని మ ♦ స్తక మెవండు
వానిశిర మప్పుడే నూరు ♦ పఱియలగు న
టంచు సైంధవుతండ్రి శ ♦ పించె తపసి.

వ. కావున నావృద్ధక్షత్రుండీశమంతపంచక సమీపమున జపంబొనరు
చుండు నీశిరం బాతపసితొడపై బడునట్లు గొట్టుమన నతండట్ల
సేయ తచ్ఛిరం బాతని తొడమీద బడిన దిగ్గనలేచి త్రోచిన న
భూమిపయిం బడుటయు నత్తపస్వి శిరమ్ము సహస్రఖండము
లయ్యె నచ్యుతుండును మాయాతిమిరంబు హరింప వృద్ధారుకుండా
లోచన గోచరుండయ్యె నంత క్రీడి నవిస్మయుండై గోవిందునకు
సాష్టాంగపడి,

కాఫీ - ఆది

ప॥ పరమపురుష గోవింద రమానాథ-పద్మనాభ శౌరి దయానిధీ ॥ప
అ॥ప॥ గరుడగమనక్షీరాంబుధిశయన-దురితదమనసరసీరుహనయనా॥

చ ర ణ ము

హరిముకుంద గోపాల పరాత్పర - ఆదిదేవ శరణాగతరక్షణ
కరివరదా విశ్వేశ మురారీ - నరసింహా కేశవ నారాయణ ॥ప

చ. కలశభవాదియోధు లటు ♦ గావలియున్న మురారి కేనియు
న్నలుపగ జెల్లునే క్రతిన ♦ సైంధవు గూల్పన్? మహానుభావ! నీ
యలఘుకృపావిశేషమున ♦ నట్టు కృతార్థుడ నైతిగాక భూ
తలమున గడ్డిపోచయు గ ♦ దల్పగ శక్తుడనే? పరాత్పరా.

వ. అనిపలుకు- క్రీడిభుజము దట్టుచు జగన్నాథు డిట్లనియె.

వ. అనిపలుకు- క్రీడిభుజము దట్టుచు జగన్నాథు డిట్లనియె.

సీ. అతిమానుషమ్మైన ♦ నర్ధరాత్రమున నం
గారపర్ణు జయింప ♦ బోరునాడు

త్రిపురాంతకో గ్రహా ♦ రించునాడు
వసుధామధ్యమున డా ♦ గిన కాలకేయాది
దనుజావళిం గూడి ♦ పెనగునాడు
గోవులకై భీష్మ ♦ కుంభసంభూతి క
ర్ణాదులం గూడి పో ♦ రాడునాడు
తే. గీ. సీకెవరు సాయమైరి లో ♦ కైకవీర !
భవ్యభవదీయశౌర్య సం ♦ పదయొగాక,
మనకొఱకు వేచియుండు ధ ♦ ర్మజుడు సైంధ
వుని వధించుట దెలుపబో ♦ వుదము రమ్ము.

క. అనిపలికి క్రీడి దోడ్కొని
వనజాక్షుడు ధర్మజునకు ♦ బవర మ్మొనర
న్ఘనుడు జయద్రథునిం గూ
ల్చినవిధ మెఱిగింప ముదము ♦ జెందె నతండున్.



# మహాభారతము

## ప్రచండపార్షతము

కమాచి - ఆది

ప॥ వినిపింతు ప్రచండపార్షతం బిగావినుడు సభికులారా ముందుమున్న॥వి॥

అ॥ప॥ పనివడిపార్షతు డా కలశభవుని బవరమ్మునం దునుమాడిన చరితము॥

చరణము

కురువిభు డా సైంధవుని చావునకు - బరితపించి మిగుల - రయమ్మున
గురునికడకుసని నిందింపగనా - కుంభసంభవుం డతనికిట్లనియె॥వి॥

మ. నను నిందించెద వేల? దేవతలకై ♦ న న్నెవ్వగానోల ద
ర్జును, గాంగేయునివంటి వీరుల్ హరా ♦ స్తు డగ్యో, మీ కౌరవు
ల్మనరంచు న్మది దోచె; గయ్యాళుల కే ♦ లావచ్చితీ వంచనన్
ధనురాచార్యుడనన్న పెద్దురథీసూ ♦ నం బిట్టు లేడ్పించెదున్.

సీ. సమవర్తి నందను ♦ శకునితో దబ్బిబ్బు
పాచికలాడించు ♦ ఫలితమిదియె
ద్రౌపది నేక వ ♦ స్త్రను రచ్చకీడ్పించి
పరిభవించిన యట్టి ♦ ఫలితమిదియె
కూడుగుడ్డకు దూర ♦ గుల జేసి చాయల
వనుల కింపించిన ♦ ఫలితమిదియె
సంధిపొసంగింప జనుదెంచిన మురారి
పలుకు లాలింపని ♦ ఫలితమిదియె

తే. గీ. చేతనగునేని బవరమ్ము ♦ సేయు మట్లు
చాలకున్నెడ ధర్మజు ♦ శరణు జొరుము

చీటికిమాటికి నన్నుంచి ♦ చెడ్డ లరయ
కెంతయు నిన్ను నన్నుడి ♦ కింతు వేల ?

తే. గీ. ధర్మవర్తనులగు పాండు ♦ తనయపంచ
కమునకు కంతలు చేసిన ♦ కఠినకర్మ
లైన నీ పక్షమున యుద్ధ ♦ మాచరించు
నట్టి నేను నిజముగ బ్రా ♦ హ్మణుడ గాను.

వ. అనిన నలి మాటల నొంతకు శాంతించి యభిమానవశమ్మున దుర్యోధనున కిట్లనియె.

హంసధ్వని - ఆది

ప॥ వినుమా దుర్యోధన పలుకులతో నిక - నను బోటికి పని లేదు నా ప్రతిన॥విను॥
అ॥ప॥ నిను మునేడు పాంచాలుర జంపక కవచంబూడుచునాడగానునే॥విను

చరణము

పురికొల్పుము సైనికుల నెల్లరను - పరికింపుము నా శక్తి నీ వేయి
నరములన నా చేతికి దాటు నారి బరిమార్పుమంచు బలుకు - మా ద్రోణికి॥వి

చ. అనిన సుయోధనుండు సమ ♦ యంగవిభు న్నుతి తక్కయోధులం
బనివడి నిల్పె కయ్యమున ♦ బాండుకుమారులు సేనతోడ మా
ర్కొన ఘనులన్ సాగె నట ♦ కుంభభవుండు మహాపరాక్రమం
బెనయగ నంపవాన గురి ♦ యించుచు నుండె విరోధిసేనపై.

వ. భీముండొకవంక కురుకుమారులతో యుద్ధమ్ము సేయుచు దుర్మద దుష్కర్ణులం జంపి ద్రోణు నెదుర్కొన సాత్యకి ధృష్టద్యుమ్న ఘటోత్కచ ప్రముఖులు కర్ణ సోమదత్తాదుల నెదుర్కొని పోరాడుచుండ ద్రౌణి ఘటోత్కచుని కొడుకగు నంజనపర్వుం గూల్ప రోషించి ఘటోత్కచుం డశ్వత్థామపైబడి భీమంబుగ సంగ్రామం బొనర్ప గురుసుతుం డద్దానవు గాటించి పాండవ సైనికులం బెకలం ద్రెనుగ్గాడి పాంచాలుర నెల్లాడుచున్నంత బకారియొక్కచో గురువృద్ధుండగు బాహ్లికుం జంపె నర్జునుండు ధృష్టద్యుమ్నాదులం గూడి ద్రోణుపైబడ దుర్యోధనప్రేరణమ్మున కర్ణుండు విజయుం గూల్తునని ప్రగల్భములాడు నెడ కృపుండు రాధేయున కిట్లనియె.

ఉ. నవ్వుదు రెవ్వరేని విని ♦ నన్ బెదరంజలుఁ గట్టిపెట్టు, మా
కవ్వడి గెల్తునంచు బలు ♦ కన్నతి సిగ్గును లేకపోయెనొ? స
క్రొవ్వులు ఘోషయాత్రను ♦ గోగ్రహణంబునఁ గానఁబోయెనో
యెవ్వ రెఱుంగ రా విజయు? ♦ హీనబలుండవు నీవు, సూతనందనా!

వ. అనవిని కర్ణుండు రోషించి;

చ. పలికినయంతపట్టు నలు ♦ పంగలవాఁడను నన్ను నీవిటు
ల్బలికిన లోపమున్నదె? నృ ♦ పాలునిఁజూచి నెమ్మొ యూరకుండఁగా
వలసెను కాదయేని కర ♦ వాలమునం దెగఁగోయుదుం గదే
తలపడి నీదునాలుక? వృ ♦ ధాకలహం బిటులాడ కెన్నఁడున్.

తే. గీ. మామ నిట్లాడఁ గోపతా ♦ మ్రాతుఁడగుచు
గత్తి దూసి యశ్వత్థామ ♦ కర్ణుని దెస
కేగునెడ నడ్డుపడి కౌర ♦ వేశ్వరుండు
ద్రోణిశారద్వతుల వేడె ♦ దత్తరమున.

సావేరి - ఆది.

ప॥ నన్నుజూచి చాలింపుడు కలహంబు - న్యాయమా? నే మనలో మనకీవిధ
అ॥ ప॥ అన్నన్నా! పగవారు చులుకగా నవ్వకింకనుగాదె మనలనిక॥

చరణము

గురుడు మీరు మద్రేశ్వరకర్ణులు - ధరయేలింపగ నున్నారు నన్ను
నిరుపమాన విక్రమసంపన్నులు - ధరణీసురులయ్యా! శాంతింపుడు॥న॥

చ. అని నరపాలుఁడా కలహ ♦ మాపెను, సాత్యకి సోమదత్తునిం
దునిమె, రణమ్ము ఘోరముగ ♦ దోచెను సూతతనూజుఁ దాకి యో
య్యన సహదేవుఁడు న్విరథు ♦ డై యవమానపడెన్ ఘటోత్కచుం
డనుపమశక్తి మీర దెగ ♦ టార్చె నలంబసదైత్యు నుగ్రతన్.

చ. అనిలజసూతి రాత్రిసమ ♦ యంబగుట న్బలమెక్కుడై వికీ
ర్తనసుతుఁ దాకి పోరునెడ ♦ ప్రాణము గాచుకొనంగ కర్ణుఁడు
న్దనకు బిడౌజుఁ డిచ్చిన ఘ ♦ నంబగుశక్తిని వైవ దానవేం
ద్రుని యురముంబగిల్చి యసు ♦ రుల్గొని వాసవుఁ జేరె నద్దియున్.

క. మృతుఁడైన హిడింబాసుతు
గతిగని పాండవులు వగవ ♦ గమలదళాక్షుం
డతిమోదమంది వలపుంగ
లతిరావంబెసగ నాద ♦ నర్జును డనియెన్.

శా. భావా, దేవ, మహానుభావ, బలసం ♦ పన్నుండు హైడింబుడే
జీవమ్ముల్ దొఱగి న్విచారపడకీ ♦ సింహారవం బేటికో
గావింప స్తణిపాంచజన్యమిటు లు ♦ ద్ఘాటించి పూరించి తే
లా? విన్పింపుము మా విచార మెటు ని ♦ కానందమై తోచెనో?

వ. అనిన వాసుదేవుం డిట్లనియె.

చ. కవచము కుండలమ్ములను ♦ గైకొని కర్ణునకిచ్చె శక్తి వా
సవు డది యున్నచో గెలువ ♦ సాధ్యముగాదతనిం బురారియున్,
దివిజనిభుండు కర్ణుడు, గ ♦ తించెను వానికి శక్తి, నీకు మృ
త్యువు దొలంగెంగదా యని కు ♦ తూహలమందితి, శంఖమొత్తితిన్.

తే. గీ. నాకు నా ప్రాణములకన్న ♦ లోకపాల
నమునకన్న నెక్కుడు నీవ ♦ సనురమంగు
నిన్ను రాధేయు డిక జంప ♦ నేర డంచు
హాయిగా నిద్రబోదు న ♦ కేయి, పార్థ!

వ. అని సమాధానమ్ము సెప్పి హిడింబానందనుని చావునకై శోకించు నెల్లవారిని వారించె; నంతదమోమయుం బగుడు కొంతదడవు యుద్ధమ్ము సాలించి చంద్రోదయం బగునంత నుభయబలంబులుం దాకి పోరుచో శరగురుం డేరికిం జేటిచూడరాక పాంచాల బలంబుం గూల్చుచు విరాట్ప్రముఖులం జంప ధృష్టద్యుమ్నుండు మండిపడుచు ద్రోణుం గూల్తునని బాసజేసి కురుబలంబుపై బడి సైనికుల నుఱుమాడుచు సూర్యోదయం బగునంతకు నేకవీరుండై యరివీరులం దెగటార్చుచు ద్రోణు నెదుర్కొని పోరాడుచున్నంత కవ్వడితోడ్పడిన నురాచార్యునితో బెనగుచున్నెడ కమలనాభుండు పార్థున కిట్లనియె.

శంకరాభరణము - రూపకము

ప॥ చేత ధనువున్నవఱకు - జేజేలు జయింప లేరు ॥చేత॥
అ॥ ప॥ వీతభయుని నిరుపమాన - నీ కలశభవుని ॥చేత॥

చరణము

దీనికొండుపాయ మేను - తెలిపెద నాలింపు పార్థ!
వినికి విన రానిమాట - నిజమిది: ధనువుఁ ద్యజించు ॥చేత॥

క. భీమునిచే బడె నశ్వ
త్థామయనంబరగు దంతి ♦ దానినెపముగా
నామాట జెప్పు డశ్వ
త్థామ గతించెనని యంతయు ♦ ధను త్యజియించున్.

వ. అంతం బరిమార్పవచ్చు నని పలుక ధర్మజాజ్ఞను లోడంబడకుండిరి. భీముండు నని కేకవెట్ట భారద్వాజుండు నమ్మకుండె నట వాసు దేవుండు ధర్మజుంగని సాభిప్రాయమ్ముగ గర్తవ్యమేమన నతం డిట్లనియె.

ఉ. సేయునదేమి? కుంభజుఁడ ♦ జేయుదు, నాదియు మానఁ లేను, నే
నేయెదిరింతు నయ్యనఘు ♦ నెట్టులనో నను బంపుడయ్య లే
దా, యనిసేత మానుకొని ♦ యందరము న్విపినాంతరమ్ములం
బోయి తపంబు సల్పుదము ♦ పుణ్యులు మౌను లుపన్యసింపగన్.

వ. అనినవిని కృష్ణుండు నవ్వుచు.

ఉ. అమ్మహనీయుతో బెనగ ♦ నక్కర లేదు నృపుండ మాటచే
దమ్ములతో వనమ్ములకు ♦ ధర్మజ పోబని లేదు, పోయిన
న్నిమ్ముగ గురుండు తా విడుచు ♦ నే? యుడియాసయెగాని, మాటసా
యమ్మొనరింపు పావనవ్రత ♦ మంచు మనంబున గొంకకిమ్మెడన్

భైరవి - రూపకము

ప॥ తెలిసె నీమనోభిమతము - తెల్లముగా గోపాలా ॥తె॥
అ॥ ప॥ పలుకు మందు మాతనితో - బిలుకుమారెనంచు ద్రోణి ॥తెలి॥

చరణము

కల్లలాడి గురుని జంపు - కన్నను ఘాటి పాపమున్నె?
చెల్లరె! యిహపరంబులకుం - జెడిధర్మజు డేమానిక ॥తెలి॥

ఉ. బ్రాహ్మణుడు డయ్యయో! చనున్ ♦ సందెఱు నేర్పిన దేశికుండు వి
శ్వాసము లేక దబ్బరలు ♦ పల్కి గతాసుని జేయుటన్న రా
కాసులుగూడ నేమని యు ♦ కార్యము, తుచ్ఛపు రాజ్య కాంక్షచే
నాసయు వన్నెయుం జెఱచి ♦ భారతవంశము పాడొనర్తునే?

చ. నలదిని గొల్వనొప్పి బకభ ♦ క్షింపగబూనుట, కాననాంతర
మ్ముల వసియించుటల్ విరటు ♦ పొంతవసించి పనింద్యవృత్తులం
గొలుచుట సత్యధర్మముల ♦ కుం జెడిపోనమటంచుగాదె, కా
వలు డనిపించుకొందు నొకొ? ♦ పాయక రిత్తవచించి కేశవా!

వ. అనిన కృష్ణుండనును.

ఉ. పాండవరక్షణార్థమన కు ♦ పాయము జెప్పితి నాలకింతువా
గండముదప్పు, నాశోఱ ♦ గా, దనృతమ్ము వచించి నీవు తు
చ్ఛుండవుగావు, ద్రోణునకు ♦ సోదరులందరి నప్పగింతువో?
చండతరాటవి న్దపము ♦ సల్పుదొ? తోచినయట్లసేయు, మిం
దుండబ నేమియూ? చనెద ♦ నొయ్యన ద్వారక కోయిధర్మజా!

వ. అనిన విని ధర్మజాతుండు వాసుదేవుం గని.

చ. అనృతములాడజాల కిటు ♦ లంటివిగాని మహాత్మ! పాండుసం
దనులకు దైవము, న్గురుడు, ♦ తల్లియు, దండ్రియు, సర్వమీవె; నీ
పనిచిన దెల్ల వీరలకు ♦ వేదము గాన నసత్యదోష మి
య్యనువున నొందకుండ విజ ♦ యంబొనగూర్పుము మాకు మాధవా!

వ. అనిపల్కిన జనార్దనుండనును.

తే. గీ. అనిలసూను డశ్వత్థామ ♦ యను గజమ్ము
నేసె, దన్నెపమున నెలు ♦ గెత్తి పల్కు
మవల మెల్లగ కుంజరం ♦ బనుము దీన
నసృతదోషమ్ము రాదు కా ♦ ర్యము ఫలించు.

సంజయుఁడు

అనిపలుకఁ సమ్మతించి ద్రోణునకుఁ - గాధర్మజుఁ డేతెంచి
తనకుంగృష్ణుఁడు చెప్పినవిధమున - ననఁగుంభజుఁ డాలించి
తనయునికై శోకించి బ్రహ్మరం - ధ్రమున బ్రాణమ్ములు వాసె
గని పార్థుండు గురునికంఠమ్ము - ఖండింపఁగ వడిఁ డాసె.

వ. అట్లుడాసి ధర్మజాదులు వారించుచున్నను వినక కరవాలమ్మున ధనురాచార్యు కంఠమ్ము వెగఁగోయ సహింపక సాత్యకి ధృష్టద్యుమ్నుంగని.

సారంగ - రూపకము

ప॥ క్షత్రియ చండాలుఁడవై - శవకంఠము గోసినావ ॥క్షత్రి॥
అ॥ ప॥ పాత్రాపాత్రము లరయక - పాంచాలకుల కళంకా ॥క్షత్రి॥

చరణము

ద్రోవది తలవంపవలసె - తోడఁబుట్టు వీవగుటను
బావమఱఁదివై పాండవ - భవ్యయశము జెఱచినావు ॥క్షత్రి॥

తే. గీ. కౌరవులు పాండవులు మించి ♦ గారవించు
దేశికునకిట్లు ద్రోహమ్ము ♦ జేసె నెవఁడు
బ్రతుక నేర్చును నామరూ ♦ పములు గలిగి?
పాండవ శ్యాలకుఁడవౌట ♦ బ్రతికినాఁడవు.

వ. అనిన ధృష్టద్యుమ్నుండు సాత్యకింగని,

చ. పలుకకు దెల్ప నెల్లగును ♦ ప్రాజ్ఞులపో! తమతప్పు లెవ్వియో
యెఱుఁగరు సౌమదత్తిని వ ♦ ధించితి వీ వెటు? భీష్ము నేగతి
న్నరుఁడు జయించె? నేఁడు ఘట ♦ నందను గూల్పఁగ ధర్మసంభవుం
డరిగిన మార్గమెట్టిదియొ? ♦ యందరికి న్విశదమ్ము గాదొకో?

వ. అని సమాధానముం జెప్ప పార్థుని చుఱచుఱం జూచుచు సస్జనుం డిట్లనియె

ఉ. కల్లలువల్కఁ నేఁడు కుల ♦ గౌరవముం జెడఁగొట్టుకొంటచే
నెల్లరిలోన మేనుతల ♦ లెత్తక సిగ్గిలుచుండ నయ్యెయో!
చెల్లని సాహసమ్మున ని ♦ సీ! శవకంఠముఁగోసి నేఁటికి
వల్లన నచ్చమైన ద్రుపద ♦ దాన్వయము న్మలినం బొనర్చితే?

వ. అనవిని కటకటంబడుచు ద్రుపదసూనుం డర్జునునకిట్లనియె.

చ. ద్రుపదకులమ్ము నల్పువడె ♦ ద్రోవదినిచ్చిననాడె మీకుఁ; మా
కిపుడది క్రొత్తగాగలుగ ♦ దేమనుకొన్నను లాభమేమి? చు
ట్టపు మరియాద నెంచి జగ ♦ డమ్ముగ సాయముసేయ వచ్చుట
న్నెపమిడి బుద్ధిచెప్పితివి ♦ నిన్ననగా బనిలేదు, వాసవీ!

చ. కలశభవు న్వధించుటకు ♦ గా జనియించితి జన్నమందు కే
వల, మటుగాన నా భుజాసి ♦ ప్రాణము వాపితి, దోసమెట్లగున్?
తలపుము, సితనుంభవు న ♦ ధర్మముగా శిరంద్రుంచి పోరిలో
బలువురు చుట్టుముట్టి సుతు ♦ ప్రాణము దీయగ హేతు వీతడే.

వ. అనిపల్కి-నం గోపించి సాత్యకి,

అఠాణా - ఆది

ప॥ సిగ్గుమాలి నోర్మూసికొనక కిల్లు - చేసిన చేత సమర్థింతువేల॥సిగ్గు॥
అ॥ప॥ తగ్గజా స్త్రిసికియుద్ధజగమి గ్రాగుబ్రోతువ లెవదరుచున్నావు॥సిగ్గు॥

చరణము

శిరమింకిను పగుల చేల వాలుక - చీలికలై చనదేల? పాపాత్మ!
గురుపరాభవ మహాపాతకముం-కొడిగట్టిన చండాలుడ విస్సీ ॥సి॥

తే. గీ. అనుచు బల్కు రోషాయుణి ♦ తాత్ముడగుచు
ధరను లంఘింప దనయుర ♦ దమ్మునుండి
కేశవప్రేరితుం డైన ♦ కీచకారి
రయమునం బట్టినిలుప బా ♦ ర్షతుడు పల్కె.

శా. రాని మ్మాతను నిల్వరింపకుము బీ ♦ రమ్మెల్ల జూపింప ని
మ్మేనుంజూతు, వివాదమేమిటికి ♦ పోనిమ్మంచు శాంతించుటల్
దానేమా ప్రకటించుకోదొడగె వా ♦ గ్దర్పమ్ము భూరిశ్రవుం
గా నన్నుం దలపోసెనో? విడువుము ♦ జ్ఞానమ్ము వారించెదన్.

చ. అనవిని పాండవాగ్రజుడు ♦ నంబుజనాభుడు వారిరువ్వర
స్వసివడి శాంతచిత్తుల నొ ♦ సర్చిరి; ద్రోణసుతుండు నయ్యెడం
గనుగవ నెఱ్ఱదామరల ♦ కైవడి కెంపుజనింప నుగ్రకో
పనుడయి రోజుచుం బ్రళయ ♦ భైరవుపోలిక బల్కె నీవిధన్.

పూర్వకళ్యాణి - ఖండగతి

ప॥ ఖండనము తొలగిపో - కుండు డీనాటితో
బనిదీర్తు పాపులారా - పాండునందనులారా! ॥పసి॥

అ॥ ప॥ దండనార్హుల రీర - పాండవము? గావించి
తండ్రిబుఱు మీవాడు - తప్పకే దీర్చెదన్ ॥ఖం॥

చరణము.

జనకుజంపిన కోప - మున కుఠారముబూని
జనపిభుల దెగటార్చిన - భృగురాముని పోలిక
జనకవధ సంజాత క్రోధ - మున నీరాణి
సాయకాగ్నికి మిమ్ము - శలభముల గావించు ॥ఖం॥

వ. ఇట్లుపల్కి,

సీ. బ్రహ్మాండభాండంబు ♦ బ్రద్దలై పేటెత్తి
భోరున పిడుగులు ♦ మ్రోతలెత్త
జవ్వాడి ధారుణి ♦ చక్రమ్ము దిగ్గిర
దిరుగ, మార్తాండుండు ♦ తేజమడల,
దిక్సామజమ్ములు ♦ త్రెళ్ళ, చుక్కలురాల,
గ్రహసమూహమ్ము చీ ♦ కాకువడగ,
కులశైలములు గ్రక్క ♦ దల, నేడు వారాసు
లేకమై భూభాగ ? మెల్ల పొరల

తే. గీ. శస్త్రగురు తనయుండు నా ♦ రాయణాస్త్ర
మేయగా నది పెనుమంట ♦ లెగయ వచ్చె
టదసి సైనికులెల్లరు ♦ బఱవ దొడగ
వడి జనార్దను డనె నెల్ల ♦ వారు వినగ.

క. నారాయణాస్త్ర మయ్యది
మీరాయుధములను విడచి ♦ మీ వాహనముల్
బీరముడిగి డిగ్గి నమ
స్కారము గావింతు రేని ♦ కాల్పదు మిమ్మున్.

వ. అనుటయు సకలజనంబు లట్లుగావించునెడ వాయునందనుడు సైని
కుల కిట్లనియె.

చ. వణకి సమస్కరింపనుడు ♦ వాహనము ల్దిగి శత్రుసాయక
మ్మున కదిశాంత్రవున్ శరణు ♦ బొందుటయే యగు భీతిమాను డే
సణచెద ద్రౌణిసాయకద ♦ నానలకీలల రాచపుట్టువ
దిన మగవానికిం దగునె ♦ తేజము మాపుకొనంగ జూచుటల్.

మ. అని కుంతీసుతమధ్యముం డపుడు శం ♦ ఖారావముం జేసి ని
ల్చిన ప్రత్యర్థిశరానలంబు వెసగా ♦ చ్చిచ్చుంబలెం జుట్టు ము
ట్టిన కృష్ణార్జును లాయుధమ్ముగొని యా ♦ శ్లే తేరిపైనుండి చ
య్యన నాభీముని డిగ్గద్రోసి కిలక ♦ య్యస్త్రంబు శాంతింగనెన్.

వ. అంత నశ్వత్థామయు గోపావేశంబున ధృష్టద్యుమ్న సాత్యకుల
మూర్ఛనొందించి కివ్వడిం దలపడి,

శంకరాభరణం - త్రిశగతి

ప॥ మాకడ విలువిద్య నేర్చి - మాపై దలపడెదవా ॥మా॥
అ॥ ప॥ పోకార్తు న్నేడు పారి - పోక నిల్వు మో క్రీడీ ॥మాక॥

చరణము

కల్లలు బల్కించి ద్రోణు - గడతేర్పించితివి చెనటి
యిల్లలికిన బంధువయ్యె - నే ద్రోణాయని లేడే ॥మా॥

తే. గీ. అనుచు బావకబాణమే ♦ యం గిరీటి
సరగ బ్రహ్మాస్త్రమున దాని ♦ సమయము జేసె
ద్రౌణి విలుపాఱవైచి ర ♦ థమ్ము డిగ్గి
యేగు నెడ వ్యాసుడెదురై వ ♦ చించె నిట్లు.

మ. నరనారాయణు లాదిమౌనులు జగ ♦ న్మాన్యు ల్భువనస్థావనీ
భరముంబాపగ ధర్మమెల్లెడల ♦ నిల్పన్ జన్మముం బొంది రి
ద్ధర కృష్ణార్జుననామము లవ్వడసి స ♦ త్యప్రజ్ఞు లవ్వారి ని
ర్జరులైనం బరిమార్పజాలరు యథా ♦ ర్థంబిద్ది ద్రోణాయనీ!

వ. అనిపల్కి వ్యాసభగవానుం డంతర్ధానంబు నంద ద్రౌణియు కురు
పతి పాలికింబోవ బాండవులు సంతసమ్మున నిజశిబిరంబులకుం
జనిరి.

---



# మహాభారతము



## కర్ణప్రతాపము

భైరవి - ఝంపగతి

ప॥ వినిపింతు కర్ణప్ర - తాపసత్కథ నేడు
వినుడు పుణ్యాత్ములారా - సభాసదులార ॥వి॥

అ॥ ప॥ ధనువు చేతంగొన్న - ఘనులలో మొనగాడు
ననిమిషాదులకే - నజేయుండు కర్ణుండు ॥వి॥

చరణము

శరగురుండు గతింప - కురువిభుడు రాధేయు
సైన్యాధిపతిగ జేసె - దూ, ర్యారావములు మ్రోయగ
నిరుపమ పరాక్రమము - నెఱపి రిపుసైనికుల
నుఱుమాడె తొలినాటి - బవరమున సంగతి ॥వి॥

సీ. తగిన సారథి లేమి ♦ తలచి సుర్యోధనుం
డంగరాజునకు మ ♦ ద్రావనీశు
సారథ్య మొనరింప ♦ సంప్రార్థనము సేయ
విడక తోచినరీతి ♦ విచ్చలవిడి
నేమేమి పల్కిన ♦ నిచ్చగించు నిబంధ
నమ్మున శల్యుండు సమ్మతించె,
నుభయసైనికులు ర ♦ ణోర్వికే తెంచిరి
సంగరప్రారంభ ♦ సమయమునను

తే. గీ. అశ్వహృదయజ్ఞుడగు శల్యు ♦ డట్లు తనను
సూతుడయ్యెనటంచు మె ♦ చ్చుచు దినేశ

నందనుం డెంతయు న్మహా ♦ నంద మంది
పలికె నీనిధి మద్రభూ ♦ పాలుతోడ.

ఉ. సూతకులుండు వీడనుచు ♦ సూతయు రోయకు మాత్మలో, బురా
రాతికి నల్వపోలిక, బ ♦ లారికి మాతలి కైవడిన్, మురా
రాతికిరీటికింబలె, ను ♦ రమ్మున మద్రధ చోదకుండవై
ఖ్యాతిగడించి నాకు విజ ♦ యం బొడగూర్పుము మద్రభూవరా!

ఉ. కవ్వడిగాదు నేను కలి ♦ కంతుడె సల్పిన నిల్చుగాక నా
దవ్వుల బాఱదోలి భుజ ♦ దర్పము నూపి విరోధివర్గముం
గ్రొవ్వడగించి శక్రసుతు ♦ గూల్చి సుయోధను నప్పుడీర్చెద
న్నవ్వులుగావు నానుడులు ♦ నమ్ముము సేయుము సూతకృత్యమున్

వ. అనిన శల్యుండును,

కేదారగౌళ - రూపకము

ప॥ కుంతీతనయుల రణమున - గూల్తునననుకు జగమునవ్వ ॥కుం॥
అ॥ ప॥ చింతింపుము మాటలనుం - జేతలకుం జాలదవ్వ ॥కుం॥

చరణము

కవ్వడితో నీకు పోల్కి - కలదా? సూతకులీనా
యెవ్వరెఱుంగనిది నక్క - యేడ? నాకలోక మేడ ॥కవ్వ॥

సీ. కులమూ, ప్రసిద్ధ పౌ ♦ రుల కాలవాలమై
యలరారు నల భార ♦ తాన్వయమ్మొ
బాహువిక్రమమూ, భ ♦ వానీకళత్ర బి
డౌజాది సన్నుతి ♦ భాజనమ్మొ
సాధనప్రకరమూ, ♦ సర్వసుపర్వ ప్ర
సాదిత దివ్యాస్త్ర ♦ సంచయమ్మొ
సారథియూ, సమ ♦ స్త జగన్ని యామక
స్తవనీయ దేవతా ♦ చక్రవర్తి

తే. గీ. నిరుపమాన ప్రభావు డ ♦ న్నిట గిరీటి
యాతనికి నీకు బోల్కి లే ♦ దరసిచూడ

గడ్డిపోచయు గదలింప • గా నశక్తు
లకు భవాదృశులకు బ్రాఁగ • ల్భ్యములు మొగడు.

చ. భువనములెల్ల భస్మమగు • బూజ్యుఁ డజాతరిపుండె యాగ్రహించెనో,
బవనసుతుండు చేతిగద • బట్టి రణంబున నిల్చెనేని నా
సవ వరుణాదిదిక్పతులె • ప్రాణభయమ్మున పాఱజూతురు, రా
కవలు నిరంకుశుల్సమర • ... ను; లెవ్వనికైనలు ... ?

వ. అనవిని రాధేయుం డిట్లనియె.

మ. సరిలే! సారథి చేయనైన యుపదే • శం బిద్దియా? క్రీడిమా
దిరి నేపోరగ లేనా? శౌర్యకరణిం • జే నీవు పోలంగ లే
వా? రణోత్సాహమా నాపై జేమిటికి? చా • ను లగ్నమ్ములు జెప్పి, పా
మరులై యట్లు తమంత నేపడిన భీ • ష్మద్రోణు లన్నెంచితీవో?

వ. అనిన శల్యుండును,

తే. గీ. దేవకీతనుజాతు మా • దిరి రథమ్ము
నడప నేర్తు నేమో కాని • నరుని పోలె
నీవు యుద్ధమ్ముగావింప • లేవు, నిజము;
నీకుజయమనుమాట కుం • దేటికొమ్ము.

వ. అనినవిని కనలి రాధేయుండిట్లనియె.

నాట - ఆది

ప॥ నోరుమూసికొని-తేరు పోనిమ్ము కాఱులాడి ప్రాణములకు జెడకుము॥
అ॥ప॥ మేరమీరి పరుషోక్తులాడెదవు-సారథ్యద్రోహివైతివేమొ యీనాడు॥

చరణము

వరుసవావులు దలంపక పురుషులు వనితలుం గవయజాతురుగాదే
పరువుమాలి పలువురకుంబుట్టిన-పాపాత్ములు మీరెవ్వరెఱుంగరు॥

తే. గీ. సర్పసాయక భార్గవా • స్త్రములుగలవు
మాధవధనంజయుల బరి • మార్పకెట్టు
లూరకే పోవు నయ్యావి? • తేరునడపు
మీ నిరుత్సాహవచనంబు • లింకమాని.

వ. అనవిని శల్యుండును,

ఉ. పాయుదు రాఘవ బంధుపుత్రుల ♦ భార్యల నమ్మగిజూతు రంగదే
శీయులు, వారికేలిక వి ♦ సీ కలుద్రావితినన్న మాత్ర నా
కీయెడ బన్నవారేవురు నెవ? మ ♦ హీసురశాపమునన్ గతాపని
స్నియరదమ్ము గ్రుంగదొకో? ♦నిష్ఫలమేగద భార్గవాస్త్రమున్?

శా. లేవా ద్రోవది పెండ్లినాడు సమరో ♦ ర్వి జిత్రసేనుండు గొం
పోవం గౌరవనాథు నీవచట లే ♦ . ? లేవా కో శూరతల్
గోవుల్దోలుకపోవునాడు కుమతీ! ♦ గుఱ్ఱంపగా నేరకు
న్నావా పార్థునిలాపు? క్రిందవడియు ♦ న్నావు నందెమే యందువే?

క. అనిన న్వినిరాధేయుడు
వినయియును నటించి కృష్ణ ♦ విజయుల జూపిం
చినవారలకు ధనము పా
యనముగ నిచ్చెదనటన్న ♦ ననె శల్యుండున్.

శ్రీరాగము - రూపకము

ప॥ ఎవరుంజూపగ బనిలే - దీ యపాత్రదానమేల ॥యె॥
అ॥ ప॥ వివరించుగదా గాండీవ - విముక్తశరపరంపరయె ॥యె॥

చరణము

దేవదత్త పాంచజన్య - దివ్యారవములె నూపును
కావలసిన కపికేతన - కాంతిపుంజమే నూపును ॥యె॥

సీ. వైశ్యపుత్రకులొకట ♦ నాయమునంబున కెంగి
ఖలు నెట్టి మేకుగా ♦ గ్రొవ్వుపట్టి
రత్నాకరముపొంత ♦ రాయుంచ నొకదాని
గాంచి నాతో బంత ♦ గా దొడంగు
మని మింటికెగసి పా ♦ ఱు సంతకాయాస
పడి మఱిచెంచి యా ♦ వ్వన ధిమున్ను
సంతలో గరుణించి ♦ హంసయు వీపున
నుంచుక కాకమ్ము ♦ నొడ్డుసేర్చె,

తే. గీ. కురుకుమారులయొంగి ళులల్ ◆ గూడను క్రొవ్వి
కొలదియెఱుగక కాకమ్మ ◆ వలెను రాజ
హంసయగు పార్థునెదిరించె ◆ దకట! తివిరి
చేటువాటిల్లు నీకు ను ◆ మ్మాటి కిపుడు.

చ. హరిణము కేసరిన్, శశకము ◆ హస్తిని, సర్పము గృధ్రరాజము
న్గరమెదిరించు చందమున ◆ గవ్వడితో బెనగందలంతు వీ
కరణి, పురారికి న్వశము గాని ◆ కిరీటి నెదుర్కొనంగ, నీ
గరువతనం బెఱుంగ నిది ◆ గాదుగదా ముముఖాటెవ్వరికేన్?

వ. అనిన కర్ణుండు కటకటంబడుచు గాంభీర్యభరంబున గోపమడంచుకొని,

చ. అడిగితినే ధనంజయు బ ◆ లాతిశయం బెన్నగి చెప్పుమంచు నీ
న్నడుగక శాత్రవుం బొగడు ◆ టొప్పునె? మద్రప! నీవిదె సుండవై
చెడుగవు మిత్రవంచనము ◆ సేయదలంచితి వింతమాత్రనే
జడియుదునే? సుయోధనుని ◆ సఖ్యమెదం దలపోసి సైచితిన్.

వ. అని పలుకునంతలో యుద్ధప్రారంభమగుడు సంశప్తకులు సవ్యసాచిం దలపడిరి. అశ్వత్థామయు ధృష్టద్యుమ్నునిం జంపి కాని కవచము విడ్వనని పలుకుచు ఘోరమ్ముగ బోరుచుండె. భీమదుర్యోధనుండొరుం దాకిరి. కర్ణుండు పాంచాల కుమారులం బెక్కండ్ర జంపుచు పాండవసేనం గలంచునెడ సాత్యకి ప్రముఖులు భీమసేన పురస్సరమ్ముగా సనుదెంచి రాధేయుం దాకునంత, కృపకృతవర్మాదులు భీమాదులం దలపడి పోరుచున్నంత భీమసేనుం డంతకాకారుండై కర్ణనందనుండగు సత్యసేనుం దునుమ రాధేయుండును గనలి పాండవసైనికులం గూల్చుచు సాత్యకి ప్రముఖుల విరథుల గావించి ధర్మజుం దాకి బిట్టలయించి సారథుం జంపి కాందిశీకుం డగుచున్న యుధిష్ఠిరు దవిలి నిలువరించి యిట్లనియె.

దేవగాంధారి - రూపకము

ప॥ ఇంత చేతగానివాని - కేమిటికీ యని సేత ॥ఇం॥
అ॥ కాంతలకుం దీసిపోవు - గదా! నీనొసటివ్రాత ॥యిం॥

నదిమెఱింగి మహోగ్రుడై ♦ యర్జునుండు
గదిసి కర్ణునెదుర్కొని ♦ కయ్యమాడె.

ఉ. భానుసహస్రతేజమున ♦ భాసిలు కర్ణునెదిర్చి నిల్వఁగా
నరు డెంతయున్ వగచి, ♦ యగ్రజునైనను జూచివత్తు; నీ
లోన శ్రమమ్మునొగ్గునని ♦ లోఁ దలపోసి ముకుందుఁగూడి తో
డ్తో నరుఁబెంచి ధర్మజున ♦ కుం గడుభక్తి నమస్కరించినన్.

తే. గీ. ధర్మసూనుండు క్రీడి రా ♦ ధాతనూజు
గూల్చివచ్చెనటంచెంచి ♦ కుతుకమంది
కర్ణు నీవు వధించిన ♦ క్రమము దెల్పు
మనిన "నెలవిమ్ము కర్ణు గూ ♦ ల్చు" నని పలుక.

వ. ధర్మజుండును నొచ్చియున్న కతమ్మున నలుకఁగదిరి కవ్వడితో నిట్లనియె.

సాం॥ తోడి - రూపకము

ప॥ సేమముగ వచ్చితివా - చేతగాని నా ॥సేమ॥
అ॥ ప॥ చేమోడిచి యిటులశిబిరము - చేరిన యీయాడుదాని ॥సేమ॥

చరణము

రాధేయునకోడుదని సు - యోధనుండు మున్నె జెప్పె
యోధుఁడ వీవనినమ్మట - నాదియ కాదే నేరము ॥సేమ॥

చ. చులకన జేసె నన్నటుల ♦ సూతసుతుండు పరాభవించినం
దులకు విచారమూనను న ♦ నుం జెయిజిక్కినవాని జంపకే
యలఘుద మీమతి న్వదలి ♦ నందుల కేడ్చెద, సూతనందను
న్గనల జయింపలే కిటుల ♦ నన్గని నీవును నేడ్వవచ్చితే?

తే. గీ. తలప నేనొకరుండ రా ♦ ధా తనయున
కోడితినటంచ నేమి? నే ♦ డోడితీవు
వాయుసుతుడును గవ లిది ♦ వఱకె యోడి
రిట్లు మనతోడగూడి (శ్రీ) ♦ కృష్ణుడోడె.

చ. కరమున నున్న కార్ముకము ♦ గాండివమంట, రథమ్ము జిందముల్
హారులు నిలింపులిచ్చినవి ♦ యంట, మహాప్రథచోదకుండు (శ్రీ)

శ్రీ

# మహాభారతము

## కర్ణవధ

కల్యాణి - ఆది

ప॥ వినుడీ కర్ణవధ వినిపించెద - ఘనఘనులారా సువరిణ్ణ గొ సుమ ॥వి॥

అ॥ప॥ అనుపమానదివ్యాస్త్రసంపన్ను - డౌభృగురాముని శిష్యుడైన కర్ణుని ॥

చరణము

యమతనయుని సెలవందివేగకృష్ణార్జును లాహవరంగమునకు చని
సమర మొనరించు భీమసేనునకు - సాయమైమరి భూభారమడంపగ ॥వి॥

సీ. హరి మేనికాంతి వా ♦ నరకేతనప్రభ
లవ్వడిరాక దె ♦ ల్పగ బకారి
హర్షించి శత్రుసం ♦ హార మొనర్చుచు
సౌబలుందాకి మూ ♦ ర్ఛపడ జేసి
సైనికులం గూడి ♦ చయ్యన రాధేయు
దాకి గర్జించు నం ♦ దఱకు నన్ని
ధూపులై తనరి శ ♦ త్రువుల నోంచుట గాంచి
దివిజేంద్రతనయు డా ♦ దిక్కు గవిసి

తే. గీ. ద్రోణతనయాదుల న్విర ♦ థులనొనర్చి
కురుకుమారుల బదుగురం ♦ గూల జేసి
యంగరాజు నెదుర్కొనె ♦ నంతలోన
దుస్ససేనుండు వాయుపు ♦ త్రుని దలపడె.

చ. సమరముమాని తొమ్ముభయ ♦ సైనికులున్ వెఱగంది చూడ ను
గ్రముగ బెనంగుచున్ బ్రబలయ ♦ కాలునిలీల గదన్ధరించి రో
సమున సుయోధనానుజుని ♦ చయ్యన నేసె బకాంతకుండు బీ
రము సెడి నేలగూలె రుధి ♦ రమ్మును గ్రక్కుచు దుస్ససేనుడున్.

వ. అట్లు నేలంగూలిన దుశ్శాసనుం గదిసి మెడఁద్రొక్కి భీముండిట్లనియె.

అఠాణా - ఝంపగతి

ప॥ చిక్కితివి గోరినా చేతికిన్నాళ్ళకిదె
చెల్లించుకొందు ప్రతిన కౌరవకులపాంసన ॥చి॥

అ॥ ప॥ యెక్కడికిఁబోయె దీవెవ్వాఁడు దిక్కిఁక
నీ భీమసేనుఁడే నీపాలి యముఁడురా ॥చిక్కి॥

చరణము

కడిమి సెడి అగ్రజా - జ్ఞాపాశముల చేత
కట్టువడి యున్నాఁడరా - జానువడిన సింగమువలె ॥కడి॥
చెడుగ నీకునిదీర్ప చేకూరె - సమయమ్ము
కడముట్టదీర్తు నీ - కండకావర మెల్ల ॥చిక్కి॥

సీ. నడురేయి కాశికా ♦ నగరమ్మునన్ లక్క
యిల్లు గాల్పించిన ♦ ట్లిపుడు లేదె
నిద్రితుం ద్రాటబం ♦ ధించి యగాధంపు
టేట ద్రోయించిన ♦ ట్లిపుడు లేదె
నమ్మించి యట్టుల ♦ న్నమున విసమ్ము గ
ల్పించి పెట్టించిన ♦ ట్లిపుడు లేదె
సతి నేకవస్త్రను ♦ సభకు ముందలపట్టి
యీడిచి తెచ్చిన ♦ ట్లిపుడు లేదె

గీ. ఒన్న గాచునో? సౌబలు - డడ్డపడునో?
కర్ణుడేవచ్చి తప్పింప ♦ గలడొ? నేడి
పిలువు మొకపరి గొంతెత్తి ♦ పిలుకుమార్తు
[illegible]చ్చు [illegible] ♦ రొక్కచోట.

వ. అని పల్కి.

సీ. ఆవేశమున బొంగు ♦ చున్ కఠారము దూసి
జళిపించి విపులవ ♦ క్షమ్ము జీరి
యుబికెడు శోణితం ♦ బొగి దోయిటం గొని
ప్రతిన లోదలచి యేవమ్ము గొనక
తల్లిచన్బాల చం ♦ దమున దేనియఁ బోలె
చవికి మెచ్చుచు నంత ♦ సమున ద్రావి
మొగమున న్నెనెల్ల ♦ మొగి జల్లికొని భయం
కరమూర్తి నరసింహు ♦ కరణి నొప్పి

తే. గీ. గడపి దుశ్శాసనుం బట్టు ♦ కేకలిడుచు
నాడుచుం ద్రుళ్ళుచు భుజమ్ము ♦ లప్పళించి
గొఱియలంబలె గురుసేన ♦ దఱిమిఱిమి
యొక్కచో నిల్చి పల్కెన ♦ త్యుగ్రలీల.

శా. రండీ! మూతుల మీసముల్ గలుగు శూ ♦ రమ్మన్యులీసేన ను
ద్దండుల్లావుగలట్టియోధులు బలో ♦ ద్దర్పమ్మునన్నన్నెదు
ర్కొండీ పాఱగనేటి కీకరణి పా ♦ ఱుం బోతురై, నంతతా
ఖండోత్తుంగ బలాతిధీరత మిమున్ ♦ గాఱింపకే పోదునే!

తే గీ. అనిన రోషించి కవచిషం ♦ డాదికురుకు
మారదశకమ్ము దాకన ♦ మీరతనయు,
భల్లదశకమ్మునన్ మహా ♦ బలసుతుండు
ధారుణిన్ ద్రొల్లనేసెన ♦ వ్వారితలలు.

వ. అట్టియెడ కర్ణాది కౌరవసైనికు లెల్లరును సమరవిముఖులై వెలవెల బాఱియుండ శల్యుండు రాధేయున కిట్లనియె.

భైరవి - ఆది.

ప॥ తెల్లవోయి చూచెద వేటికి నీ - వల్లగాక నా? సూతనందనా ॥తె॥
అ॥ ప॥ యిల్లుదాఱియుండక వీరుడనని ప్రొల్లుబీరమ్ము-లాడి రణమ్మున ॥

చ ర ణ ము

నమ్మికొన్నాడు కురునాథుడు పాం - డవులేవుర దెగటార్తు వీవనుచు
సొమ్మదిన్న నిశ్వాసము జూపుము - శూరాగ్రణివై నీవిటులూరక ॥ తె॥

తే. గీ. అనిన సమరోన్ముఖుండయ్యె ♦ నంగనృపతి
యంతలో వృషసేను డ ♦ య్యనిలతనయు
పైనుఅవడింపు గోపించి ♦ ఫల్గునుండు
వాని మస్తకమున్ ద్రుంచె ♦ బటుశరమున.

మ. తనయుం గూల్చుట సూచి కర్ణుడును క్రో♦ధస్ఫూర్తియై యుగ్రదనం
దను నుద్వేగమునిూఱ దాకి నిఖిలా ♦ స్త్రప్రాభవం బేర్పడం
బెనగం గ్రీడియు వాడితూపులగమిం ♦ బెల్లేసి రాధాతనూ
జుని నొప్పించి యొకంత కిట్టులనియెన్ ♦ శూరత్వ మేపారగన్.

ఉ. బాలకుచేతివి ల్లెనుక ♦ పాటున ద్రుంచి వధింపజేసి తీ
వాలమునం దధర్మముగ ♦ నందులకీ వృషసేనుమూర్ధము
న్నేలకు డొల్లనేసితిని ♦ నీవాగి సూడ బ్రతిజ్ఞ దీర్చుకో
జాలితి నాకికన్ మిగిలె ♦ సంగరమందు నిను న్వధించుటల్.

క. అనిపల్కి ఖచరతండము
తనువినుతింపగ సురేంద్ర ♦ తనయుడు రాధే
యుని దాకునంత ద్రోణా
యని దుర్యోధనుని చెంత ♦ కరిగి యనెనిటుల్.

మోహన - ఆది

ప॥ నరనారాయణు లాకృష్ణార్జును - లరయ
మొందే నవధ్యు లజేయులు ॥నర॥

అ॥ ప॥ గురుభీష్మాదుల - కన్న నధికుడే
పరికింపుము నీనమ్మిన కర్ణుడు ॥నర॥

చ ర ణ ము

సమ్మతింపు మిపుడేని సుయోధన - సంధి గావింతు కురుపాండవులకు
కమ్మగా ననుభవింపు డెరి భా-గమ్ము లవ్వారు పోరాట ముడిగి॥నర॥

చ. నిలుపుము కర్ణునిన్ విజయ ♦ నీల్గును, శౌరియు ధర్మరాజును నా
పలుకులు విశ్వసింతురు, క ♦ వ్వలికి వైరియు ధర్మజాజ్ఞతో
మెలగుదు, రిట్లు మాన్యము స ♦ మీరకము, దాన సమస్త భూజను
ల్గలహము దక్కి శ్రేయములు ♦ గాంతురు, నీజనకుండు బ్రీతుడౌ.

చ. అరయకుమీ యవధ్యుల మ ♦ టంచు గృపుండును నాథసంజయుం
డురమున గూల్చె నేర్పుమని, ♦ ద్రోణుడు భీష్ముడు వమ్ములేగదా!
హరికరుణాకటాక్షమున ♦ నా రథికుల్ నరుచే నడంగరే?
కర మడిబీరపుందులువ ♦ కర్ణుడు గూల్పగలాడె కవ్వడిన్?

ఉ. మాధవు డిట్లురా వెడగు ♦ మాటలు పల్కితి మింకనైన యే
మాదిరియౌ నటన్న యను ♦ మానము వీడగదోయి! మించిపో
లే దిపుడేని యూర్కొనుము ♦ లెస్సయగున్ బ్రతుకంగనేస్తు రెం
తే ధృతి చీకటూల్మగలు ♦ నీతలిదండ్రులు కౌరవేశ్వరా!

వ. అనవిని దుర్యోధనుం డిట్లనియె.

చ. అనుజులు చుట్టముల్ గొడుకు ♦ లందఱు జచ్చిన వెనుక యే మొగం
బున పగవారితో నిపుడు ♦ పొందొనగూర్చుచుకొందు? నవ్వుదే
నను జగమెల్ల కర్ణుని ధ ♦ నంజయు డ్రుంచు రణంబునందటం
చనెదవు సింగమోటువడు ♦ నా మెపుడేనియు నక్కకూనకున్ ?

వ. అనిపల్కి సైనికులం బురికొల్పి సమరోన్ముఖుండయ్యె నయ్యెడ కర్ణార్జునుల ద్వంద్వయుద్ధం బవలోకింప సుర పితృ విద్యాధర సంఘంబులును శచీపతిప్రముఖ దిక్పాలకులును నభోభాగమ్మున నిలిచియుండ నయ్యతిరథు లిర్వురుం దాకి పోరుచో గవ్వడి యేసిన బాణమ్ములన్నియుం గర్ణుండు ఖండించుచు దివ్యాస్త్రములన్నిటి నుపసంహరించుచు గృష్ణార్జునులం జిక్కుపరచుచున్నంత గనలి కమలాక్షుండు కౌంతేయున కిట్లనియె.

కాఫీ - ఆది

ప॥ ఏమివింత పార్థా దివ్యాస్త్రము-లెల్ల రాధేయుచే వమ్మైచనె ॥ఏమి॥
అ॥ప॥ నీమనంబిచట లేదో, భయమందితివో? బడలితివో? యుపేక్షింతు॥

చరణము

కావలసిన చక్రమ్మునీకిడుచు-కంఠమిూత్షణమ్మున దునుమాడుము॥
దేవదానవుల గెల్చినవీడు - దృణసముండుగాడా యీకర్ణుం ॥దే॥

మ. అనరోషించి కిరీటి కర్ణుడయి బ్ర ♦ హ్మాస్త్రప్రయోగ మ్మొన
ర్చిన గర్ణుండు తదస్త్రమున్ జెఱచి మా ♦ ర్వేగ్రుంచి, నొప్పించె గృ
ష్ణుని, వివ్వచ్చుడు నారిగూర్చుకొని య ♦ చ్చో శల్యరాధేయులం
దనువు ల్గాడగ నేసె బాణవితతిం ♦ దన్నెల్ల రగ్గింపగన్.

సీ. అశ్వసేనసమాఖ్యు ♦ డగు నాగపుత్రుండు
నాగముఖాస్త్రంబు ♦ నాతడనదు
చెంగటనుండ బ ♦ సిండి యొఱంబెట్టి
యనుదినమ్మును దాని ♦ నర్చ సేయు
చుండు గర్ణుండు, పా ♦ ర్థుండు సూపెడు ఘాటి
కాగలే కంగేసు ♦ డా శరమ్ము
వడి వింటసంధించి ♦ కడకంటికి న్గుఱి
వెట్ట శల్యుం డంగ ♦ విభున కపుడు

తే. గీ. చిత్తవైకల్యమిుం గల్గ ♦ జేయ దలచి
"సూటిచెడె, నేమిసంధాన ♦ పాటవమ్ము?
సరిగ సంధింపు"మన ... ♦ సంభ్రమమున
సూతసుతు డంత మద్రభూ ♦ నేత కనియె.

చ. అనవసర ప్రసంగము ర ♦ వంతయు సేయక తేరుదోలు, మిూ
ఘనునను బోటిజోదునకు ♦ బోరున వంకలుపెట్టు వాడవే?
విను మినుమాఱు బాణమును ♦ వింటను గూర్పడు కర్ణుడెన్నడున్
జనములునవ్వగా, తెలియ ♦ జాల వొకింతయు మత్ప్రభావమున్.

వ. అని పల్కి భుజగాస్త్రం బేసిన

తే. గీ. నద్దెసల మంటలెగయ బ ♦ న్నగశరమ్ము
రా, మురారియు పంచాంగు ♦ ళప్రమాణ
మరద ముర్వీస్థలిం గ్రుంగ ♦ నదుము నంత
పార్థుని కిరీటము హరించె ♦ పాపతూపు.

వ. అంత జంభాతకసూతి శిఖరరహితంబగు నీలగిరి చెలువున నొప్పి తెల్లనిపాగం జుట్టి క్రమ్మఱం దనపై గవియు సర్పంబు నాఱు బాణమ్ముల దునిమి కోపతీవ్రంబుగ కర్ణుం దాకి చండకాండములం నొవ్వనేయుచు కంకటమ్ము సించి మకుటకుండలమ్ములు ద్రుంచి పెద్దపెట్టున పోరాడుచు దివ్యాస్త్రమ్ము లుపసంహరించుచున్నంత రాధేయుండు భార్గవాస్త్రంబు ప్రతిభాసింపక చిత్తనైశ్చల్యంబు బాసి కుందుచు నా భూసురశాపమ్మున నాసిన యరదపు డాపటికల్లు క్రుంగిన నేటున కనువు నెట గర్ణుండు రోషవిషాదమ్ముల గస్సుగోలుక రథమ్ము డిగ్గి కవ్వడి కిట్లనియె.

ధన్యాసి – రూపకము

ప॥ ఆగుమా మహార్తకాల - మగ్గున నారథము క్రుంగె ॥వా॥

అ॥ ప॥ రాగధర్మ్ముడ వాకించుక - రథచక్రము నెత్తుకొందు ॥వా॥

చ ర ణ ము

వీతరథునితో బోరుట - నీతిగాదు నినుబోటికి । పూతాన్వయు సంజాతుడ - వాతతరణధర్మవిదుడ ॥వా॥

క. విరిదలవాని నిరాయుధు
విరథుని నీబోటి ప్రబల ♦ వీరు లెవ్వరున్
దూరె? యేయుదు, నాపలుకట
హారికిన్ మఱి నీకు వెఱచి ♦ యని దలపకుమా.

వ. అన విని కృష్ణుం డిట్లనియె.

చ. చదివిన ధర్మశాస్త్రముల ♦ సారము నేటికి తెలియంగవచ్చెనే?
మదమును గర్వము న్దురభి ♦ మానము నేమయిపోయె? నీతికో
విదుడు బిడౌజసూతి యొక ♦ వేళ నినుం గరుణించుగాక, చూ
పదుగద మృత్యుదేవతయు ♦ వశ్యము నీపయి ప్రేమ కర్ణుడా!

ఉ. వంచకులై యమాయకుల ♦ బాండుకుమారుల లక్కయింట గా
ల్పించుట ధర్మమా? సభకు ♦ నీడిచి ద్రోవది కట్టుచీర లా

ల్పించుటధర్మమా? పిరికు ♦ నెల్లరు దాకి కిరీటిపుత్రు గూ
ల్పించుటధర్మమా? తగవు ♦ లెన్నెద వియ్యెడ సూతనందనా!

వ. అనిపల్కి కర్ణుండు లజ్జించుచు నరదంబు పిఱిందికొమ్ము క్రిందికి భుజమ్ము మోపి యెత్తినం బుడమి కులశైలకాననసముద్రసహితం బాఱంగుళము లెగసె గాని రథచక్రంబులు కదలకుంటం జూచి రాధేయుం డిట్లు నిర్వేదపడె.

గీతమాలి.

అకట! కాలమునన్న - నైనయట్లు
దోఁచు నాకింక దైవమా! - తుదకు నన్ను
పౌరుషవిహీనునట్లు జావ - వ్రాసినావె?
చినతనంబున లక్ష్యవే - ధనపు విద్య
నభ్యసించుచు జన్నపు - టావు జంపి
నట్టి సాధుహింసాఫలం - బనపహార్య
మగుచు కుత్తుకపై గత్తి - యైనటించె,
పుండు వ్రేల్పెట్టి కలగించు - పోల్కి-యయ్యె
శల్యసారథ్య, మాశచీ - జాని కవచ
కుండలమ్ములు గొనిచనె, - గురుడు భార్గ
వాస్త్రము స్ఫురింపకుండ న - న్నలు శపించె,
మఱియుచున్నాడ కొనకిట్లు - మానవ ప్ర
యత్నమునగాక దుర్విధి - ప్రాతికూల్య
మున రణావని నాసుమో - ధనునికొఱకు;
కన్నతల్లికి భారమై - గంగగలసి
గండముందప్పి వర్ణ - కరత గాంచి
సోదరుల బాధపఱచు ని - చునకు, కడగి
యన్నదమ్ముల కట్టు క - య్యములు వెట్టి
పార్థు దెగటార్తునని గ్రాగ - ల్భములు పల్కి
పమ్మిప్రపుల కొలను చం - దమున నలరు

కురుకులం బెల్ల మాయించు క్రూరకర్ము
నకు, దురాత్మునకు, న్నాకు - నలువుర నగు
బాటుగా కెట్లు విజయమ్ము - బడయనగును?
మిగుల నల్లాడు చీకటా - ల్మగల యనుగు
దగుల కెట్లుండును? సాధ్వి మ - తల్లి ద్రుపద
రాజసుతకు గల్పించు ప - రాభవాగ్ని
నను దహింపక చల్లారు - నా తనంతె?
పెంచి పెద్దగజేసి ఎం - మంచిచెడ్డ
లరసి మోదించు రాధకు, - నంగరాజ్య
మొసగి మన్నించినట్టి దు - ర్యోధనునకు
ప్రియముగా సంచరించి జీ - వితము ధార
బోసితిని; దానకర్ణుడన్ - వాసి గంటి;
నిర్విచారమ్ముగా మర - ణింతు నింక.

వ. అనితలంచి గాండీవనిర్ముక్త శరపరంపరకు మేనొగ్గుచు శల్యాగని యరదంబునంగల గదాదండంబు విమ్మన నమ్మద్రేశ్వరుం డేకసక్కెముగ నిట్లనియె.

శంకరాభరణము - రూపకము

ప॥ సిగ్గువిడి గదాదండము - చేకొని పోరాడెదవా ॥సి॥
అ॥ ప॥ బిగ్గఱగా పలుకకు మిక - భీముం డిది విను నేమో ॥సి॥

చరణము

శ్రమపడి నీ నేర్చుకొన్న - శరవిద్యయె యిట్టులుండ
సమరమున గదం బట్టుట - సరిసరి! నగుబాటుగాదె ॥సి॥

క. గుఱిచెడియెం గాకోదర
శరమని చెప్పినను వినవు ♦ సమరమున నికే
కరణి న్విజయుని గూల్చెద?
వరయుము, గదబట్టుటింక ♦ హాస్యాస్పదమౌ.

వ. అనవిని కర్ణుండు కటకటంబడుచు శల్యున కిట్లనియె.

తే. గీ. మణియుని తెంగించి చేసగ్ని ♦ కణము దాల్చు
నాకు దగుశాస్త్ర జేయుచు ♦ న్నాడ వీవు
వికటముగ బల్కుచున్, వ్యాధి ♦ పీడితునక్కు
పెదవి విఱిచిన వైద్యుని ♦ విధము దోప॥

క. అనిపల్కుచు గదకేలం
గొనె కర్ణుం డంతఁగోప ♦ కురువిభు డంపం
జని ద్రోణతనూజాతుం
డనియెన్ రాధేయుతోడ ♦ నాటోపమునన్.

బాగు - ఖండగతి

ప॥ విశ్రాంతిగొనుము కురు - విభు డంప వచ్చితిని
వెఱవ నేమిటి కింక - విజయునకు రాధేయ ॥వి॥

అ॥ ప॥ ఆశ్రమంబున మాధ - వార్జునుల బడగొట్టు
నస్త్రవిద్యాపాట - వము సూపి సిగ్గాతు ॥వి॥

చరణము

సావకాశముగ రథ - చక్రముల నెత్తుకొని
సమరమొనరుప రమ్ము - సగర వీరాగ్రణీ!
భూవిభుడు నీమీద - భార మంతయు మోపి
భూమీవలయమెల్ల - నేలగా నున్నాడు ॥వి॥

ఉ. ఎక్కటిపోరు పోరుటయె ♦ యియ్యెడ నీ తలపోట నూరకే
నొక్కెడ జూచుచుంటిని, సు ♦ యోధనుపిల్పున వచ్చినాడ నీ
యక్కఱదీర్ప, నింకజను ♦ మియ్యెడ నించుక విశ్రమింపుమా
పెక్కులు పల్కనేమిటికి ♦ పేచ మడంచెద పార్థకృష్ణులన్.

వ. అనిన గర్ణుండు,

ఉ. ఏలితి నీ ధరావలయ ♦ మెల్ల సుయోధనుపేరిమీద, నీ
జాలికి యాచకప్రతతి ♦ సమ్మదమందగ వాంఛితమ్ములన్,
వ్రాలితి సంగరావని న ♦ భంగుర వీరరసైకమూర్తినై
కాలుడుగాక సాయపడ ♦ గోరుదునే యిక బాపనయ్యలన్?

చ. అనవిని ద్రౌణియుం జనియె ♦ సంగవిభుండు గదాఘాతంబునన్
కినుకదలిర్పగా విజయ ♦ కృష్ణుల గూల్పదలంచి మొంతయుగా
బెనగదొడంగె నగ్రజుండు ♦ వేగ మహాస్త్రము నొకదానిఁ దా
ధనువున గూర్చి వైచెనిదె ♦ తామరసాప్తుని ద్రోగణంబునన్.

మోహన - ఝంపగతి

ప॥ ఈమహాదివ్యాస్త్ర - మిపుడ రాధేయు శిర
మిల డొల్లగాఁజేయు - నేవీరుఁడనయేని ॥యీ॥

అ॥ ప॥ కామాది విషయవాంఛా - రహితుఁడనయేని
సోమశేఖర పాద - సేవా రతుఁడనేని ॥యీ॥

చరణము

మాతల్లి కుంతి సా - ధ్వీతిలక మగునేని
మాయన్న ధర్మజుఁడు - సత్యవ్రతుండేని
నాతమ్మ లనవరత - నుత నీతియుతులేని
నారాయణుండె యీ - నాకు సారథియేని ॥యీ॥

వ. అనిపల్కి యయ్యస్త్రమ్ము విడిచిన.

తే. గీ. రోదసీకుహరమ్ము మె ♦ ఱుంగులుగమి
నించి సైనికుల న్మూర్ఛ ♦ ముంచి సర్వ
భూతకంపన మొనరించి ♦ సూతసూతి
శిరము తెగిపడ ద్రుంచె నా ♦ శరవరంబు.

ఉ. అంతట కన్నువిచ్చి జను ♦ లందఱు సూడఁగ దివ్యతేజ మ
ల్లంతనె యుద్భుతమ్ముగ ది ♦ నాధపబింబమునందుసొచ్చె, న
త్యంతవిషాదభారమున ♦ నాత్మజుఁ డట్లు గతించెనంచు భా
స్వంతుఁడు తత్క్షణంబ సనె ♦ పశ్చిమవార్ధి దానమాడఁగన్.

సీ. జన్మింపు టావును ♦ జంపినందుల కగ్గి
విప్రోత్తముండు శ ♦ పింపడేని
జమదగ్నిసూతి క ♦ య్యమున నస్త్రములు స్మ
రింపబోవంచు శా ♦ సింపడేని

కవచకుండలములం ♦ గైకొన బాపఁడై
జేజేలఱేఁడు యాఁ ♦ చింపఁడేని
మిన్నేటికొడుకు కట్లు ♦ తన్నర్ధరథుఁ జేసి
బవరమ్ము దవమాన ♦ పఱుపఁడేని
తే. గీ. యాత్మజుల బ్రోవుమని కుంతి ♦ యడుగదేని
చిత్తవిస్ఫూర్తి శల్యుండు ♦ చెఱుపఁడేని
కేశవుండు క్రమంబు ♦ సాగింపఁడేని
కర్ణుని వధింపజాలు వి ♦ లుకాఁడు లేఁడు.

వ. అట్లు కర్ణుండు పడ గాము బాసిన కనులమ్ముకరణినున్న యరదమ్ముం దోలుకొని శల్యుండు దుర్యోధనునికడకుం జనన కౌరవేంద్రుండును దీనాననుండై కర్ణవధ సంజనిత దుఃఖావేశమ్మున నిట్లు వాపోవ దొడంగె.

నీలాంబరి - రూపకము

ప॥ నమ్మికొన్న కర్ణుఁడు పడె - నాకికేటి బ్రతుకు ॥న॥
అ॥ ప॥ బ్రమ్మవ్రాఁత దప్పింపగ - వశమె మానవులకు ॥నమ్మి॥

చరణము

పాండుతనయు లేవు రట్లు - బ్రతికియుండిరా
భండనమున నాతమ్ములు - ప్రాణ మొడసిరా ॥నమ్మి॥

తే. గీ. మనసుగలసిన మేటి సా ♦ మంతరాజు,
మంచిచెడ్డ నెఱింగించు ♦ మంత్రి, సంగ
డీఁడు, వెన్నంటి తిరుగాడు ♦ తోడునీడ
వాడిగలజోదు కర్ణుండు ♦ నేఁడు లేఁడు.

వ. అని విచారించు కురుపతికి శల్యకృపాశ్వత్థామలు ధైర్యమ్ము సెప్పుచున్నంత సంధ్యాకాలం బగుడు పోరుసాలించి కృష్ణార్జునులు పాంచజన్య దేవదత్తములు పూరించుచు శిబిరమ్ములకుం జనిరి.

---



# మహాభారతము

## సామ్రాజ్యసిద్ధి

ఆనందభైరవి - రూపకము.

ప॥ పాండవ సామ్రాజ్యసిద్ధి - భవ్యచరిత మాలింపుడు ॥పాం॥

అ॥ప॥ పుండరీకనయనుని కృప - బొంది విజయము గాంచుడు ॥పాం॥

చరణము

కానీనుడు పడినయంత - కౌరవపతి కయ్యమున్నన
సేనాధిపతిత్వమునకు - జేసెను శల్యు నభిషిక్తు ॥పాం॥

సీ. శల్యుండు కౌరవ ♦ సైనికులం బురి
కొల్పి పెక్కుర నాజి ♦ గూల్చి కడకు
పాండవాగ్రజు దాకి ♦ ప్రాణము ల్గోల్పోయె
కురుసేన యంతయుం ♦ గూలె కలన;
కురునాథు డటభీతి ♦ గొని గదా కలిత మ
హా భుజుండై కొలకు ♦ డై చనిచని
ద్వైపాయనంబన ♦ దనరు హ్రదమున జ
ల స్తంభనమ్మున ♦ డాగియుండె

తే.గీ. పాండుసుతు లయ్యది యెఱింగి ♦ పద్మనాభ
సహితముగ నయ్యెడకు జేరి ♦ సంతసమున
మడువునందున్న నృపుని వె ♦ ల్వడగ జేయ
దలచుచో ధర్మజుడు సుయో ♦ ధనున కనియె.

కన్నడ - చతురశ్రగతి.

ప॥ కలవారందరి కలన గూల్పించి - జలమున మునిగినాడవా ...॥క॥
అ॥ప॥ తులువనీజాడ నెలి।యుజాల మని-తలచి కులుకుచున్నాడ వా॥కల॥

చరణము

మానధనుడవను మాట నేటితో-మాపుకొన నెంచినాడవా
హీనపుంజావు చావ బొల్పడితి-విది మేలనుకొన్నాడవా ॥కల॥

చ. మడువునడాగినంత బరి ♦ మార్పకయుండు నె? క్షత్రధర్మమున్
విడిచితి వంతెగాక, పరు ♦ వే? కురువంశపు రాచవాని కీ
నడవడి, లోకులెల్ల నిను ♦ నవ్వరొకో ? మగవాడవైన వె
ల్వడుము ప్రహాదమ్మికక స్వదేలు♦ వారముగామునుమా,సుయోధనా!

చ. అవని సమస్తమేలుకొను ♦ వాలమునన్ మమునుగెల్చి, లేనిచో
బవరమునన్ మృతుండవయి ♦ స్వర్గసుఖమ్ములజూఱగొమ్ము శా
త్రవులకు జంకి యిట్లిహాప ♦ రమ్ములకుం జెడనౌనె ? రాజరా
జవు రణకోవిదుండవయు ♦ క్షత్రియగౌరవ మేటగల్పెదే ?

వ. అనిపల్కు- ధర్మజునకు మానధనుండగు సుయోధనుం డిట్లనియె.

చ. అలసటనంది వచ్చితి భ ♦ యంబడి గాదు రవంత నీకు; సే
నలు వివిధాయుధమ్ములును ♦ నాకడ లే వొకరుండ నేవురీ
రలు, బవరమ్ము సెల్లునె ? యు ♦ రణ్యములం దపమాచరింతుభూ
వలయము నీకొసంగితి నృ ♦ పాలుడవై చిర మేలుకొమ్మికన్.

వ. అనవుడు పాండవాగ్రజుం డిట్లనియె.

చ. కల సిరి దానపూర్వకము ♦ గా గ్రహియింపగ మేము బాపన
య్యల మనుకొంటివా? కురుకు ♦ లాధమ! నిన్గలన న్వధించుచే
తలపగుగాని సర్వవసు ♦ ధావలయం బిపు డేలుకొంట మా
తలపును గాదు నీ కిచట ♦ తప్పదు మృత్యువు; లెమ్ము పోరికిన్.

ఉ. తమ్ముడు కర్ణసౌబలులు ♦ తాము రణమ్మున జచ్చు చీయుపా
యమ్మును జెప్పిచచ్చిరె? నృ ♦ పాధమ! వల్కలధారివై యర
ణ్యమ్ములసైతముం జెఱతు ♦ వా? యపవిత్ర పదమ్ములుంచి, వే
సమ్ములు సాగ వింక భుజ ♦ సారము జూపుము రమ్ము పోరికిన్.

వ. అనిపలుక ధర్మజుని పోటుమాటలకు సుయోధనుండు చిత్తం బుత్తలపడ పుట్టలోపలి మహాభుజగేంద్రుంబలె గోజుచు జలస్తం బుడిపికొని మడువు సంక్షోభింప కాలదండంబుంబోని గదాదండం బునం సమీరమ్మున నమస్కరించి బంధులెవ్వడలి యుధిష్ఠిరానుమత మ్మున గదాయుద్ధంబొనర్ప భీమసేనుం గోరుకొని యాతని దలపడు నెడ సవ్యావర్త తీర్థయాత్రలు సేవించి వచ్చిన బలరాముం డేతెంగి ప్రియశిష్యుల గదాయుద్ధమ్ము సూడ నయ్యెడ కరుదేర ధర్మజుం డెదురై యాదరించె నంతనెల్లరుం గలసి పోలికలనికిం జని భీమ దుర్యోధనుల యుద్ధభూమి న్నిలిపిరి. అంత వారిరువురు వాసవ వృత్రాసురు లట్లొండొరుదాకి నేలవడంక లావును వేగంబును దర్పంబును జూపఱకు వెఱగుపుట్టింప బోరుచో గొంతవడికి వాయుసూనుం డలసటంజెంది యోటువడనున్నంత గుర్తించి కృష్ణానుమతమ్మున నర్జునుం డూరుతలమ్ము కరతలమ్మున నప్ప ళించి సన్నజేయ గ్రహించి భీమసేనుండు గిన్వ్వన కెగసి పోరాడు కురునరేంద్రుని యూరుభాగమ్ముల నేయు దుర్యోధనుండు తోడలు విఱిగిపడియె నట్లు పడియున్న సుయోధనుని శిరమ్మును బకారి వామపాదమ్మునం దన్ని పలువిధమ్ముల దూఱుచు దన్ను ధర్మ జాతుండు వారించినను వినక మఱల నాతని శిరమ్మం దన్ననంత హలాయుధుం డల్గి ప్రళయరుద్రుంబలె మండిపడుచు నెల్లవారల కిట్లనియె.

బిలహరి - రూపకము

ప॥ చూచితిరే! కీచకారి - సూపిన పెనుదుండగమ్ము ॥చూ॥

అ॥ ప॥ పీచమడతు వీని నొకట - ప్రేటున మీరెల్లరు గన ॥చూ॥

చరణము

న్యాయమే గదా రణమున - నాభికి దిగువం గొట్టుట?

యీ యధర్మయుద్ధము కను - లార జూచి సైపనగునె ॥చూ॥

క. అని కోపవేగమున రథ
మున నున్న స్వకీయసీర ♦ మునుం గైకొని భీ
మునిపై బడ నడ్డమునని
వనజాక్షుం డిట్టులనియె ♦ బలరామునకున్

ఉ. పాండుతనూభవుల్మనకు ♦ ప్రాణసముల్ మఱదు ల్దలంప నా
పుత్రుండవు గాన నభ్యుదయ ♦ ల్సమకూర్పగ జెల్లు వీరికిన్
భండన భూమి నూరువుల ♦ భగ్నము సేయ ప్రతిజ్ఞ జేసి భీ
ముం డది నేటికిన్నెరపె ♦ మోసము గాగ శమింపు మగ్రజా!

వ. అనవిని సీరపాణియు గృష్ణా! తలదన్నినవారల కేమి సమాధానము చెప్పెదవన,

ఉ. తప్పిదమౌనుగాక తల ♦ దన్నుట, యీతని దుష్కృతాళి నీ
తప్పును సేత పోల్పగ శ ♦ తాంశముగాదు, తలంపు మీ కలిం
దప్పక నాంఘ్రిపాదముల ♦ ధర్మమెటుల్నడచున్? బకాంతకుం
డప్పుడొనర్చె నేమొ నృపు ♦ నొదల దన్ను ప్రతిజ్ఞ నైతమున్?

వ. అనిపలుకు గోపాలుని సమాధానమ్మున కేవగించుకొనుచు హాలాయుధుండు సనె నంత ధర్మసూనుండు సుయోధను దుస్థితిం గని జాలివడి యతనిం గౌగిలించుకొని,

ఉ. తమ్ముడ! నేడు నాదు పెద ♦ తమ్ము డొనర్చినయట్టి దుష్టక
ర్మమ్ము సహింపు మేదికి ద ♦ రమ్మగు బూర్వకృతమ్ము దాటగా
నెమ్మెయి నెవె బల్ సుకృతి ♦ యెంతయు నీగతి బంధుకోటి నా
లమ్మున జంపి చేకొనిన ♦ రాజ్యము మాకు సుఖం బొసంగునే?

వ. అని విచారించు ధర్మజునకు వాసుదేవుం డిట్లనియె.

తే.గీ. సమరవిజయమ్ము గైకొన్న ♦ సంతసమున
కడల ప్రమోగించి విజయుడు ♦ కౌరవమ్ము
కోరి సింగపు గద్దెపై ♦ గూరుచుండ
కేడ్తు వేమిటి కో యమా ♦ యికను బావ!

వ. అనినవిని దుర్యోధనుండు కోపవికారమ్ములు ముప్పిరిగొన పెలుఁగదు మోవ లేచి చేతుల భూతలం బూదికొని గోపాలుం బాలమణుం జూచుచు నిట్లనియె.

సావేరి - రూపకము.

ప॥ నల్లగొల్లవాడ కపట - నాటక మాడించినావ ॥న॥

అ॥ ప॥ చల్లగా దాయాదుల కిటు - సంగరమ్ము సంఘటించి ॥న॥

చ ర ణ ము

దారమున మఱదుల కీమా - దిరి పాపపు బండిపోట్ల
ధరణీవలయం బఖిలము - ధర్మజాతుల జుట్టినావ ॥న॥

సీ. మోహారమ్మున చక్ర ♦ ముం దాల్పననిత్రో ల్ల
ప్రతిన వట్టియును చే ♦ పట్టి తీవు
కదనమందు శిఖండి ♦ నెదుట నిల్పించి క
వ్వించి శాంతనవు గూ ♦ ల్పించి తీవు
సంగరమ్మున ధర్మ ♦ జాతుచే ననృతమా
డించి కుంభజుని జం ♦ పించి తీవు
పురమందు క్రీడికి ♦ నుపదేశం బొన
రించి కర్ణుని నాని ♦ మించి తీవు

తే. గీ. తుదకు నను గూడ రణమునం ♦ దొడలు విఱుగ
నీ వృకోదరుచేత గొ ♦ ట్టించి తీవు
భరతవంశమ్ము జెఱుప బా ♦ ల్పడితి వీవు
కంసదాసకుమార! వి ♦ జ్ఞానదూర!

ఉ. నాలుగు వేదము ల్సదివి ♦ నాడ, మహేంద్రునిలీల భూతలం
బేలితి, నిప్పితమ్ముల ఘ ♦ టించితి నర్థులకెల్ల, జన్నముల్
మేలుగ జేసితి న్యశము ♦ మింటను మేదిని నిండునట్లుగా,
నాలమునందు గూలితి, ము ♦ రాంతక! నాకిక లోపమున్న దే?

ఉ. సంపద లేక, బంధుగులు ♦ సైనికులు న్మరిపెమ్ము లేక, వం
శంపు ప్రశస్తి లేక, పరు ♦ షమ్ముగ కౌరవకాంతలెల్ల దూ

సింపఁగ ధర్మసంభవుని ♦ చే గతినొందిన పాండునేల మో
యింపుము; పెద్దకాల మిది ♦ యేగద నీదగు ప్రాణిక–? కేశవా!

వ. అనిపల్కు దుర్యోధను వెనుకటి యకృత్యమ్ముల నిర్దేశించి యెత్తి పొడుచుచు గృష్ణుండు సాత్యకి సమేతముగ బాండవులం దోడ్కొని పాడఱియున్న కౌరవశిబిరమ్ములం బ్రవేశింపఁబోవ దక్కఁ-జోదు లెల్లరు దమతమ విడిసెల విడిసిరి. కౌరవశిబిరమ్ములకడ గౌంతేయులు రథమ్ములు డిగ్గనిడ గాండీవాదిసాధనమ్ములు గొని కృష్ణప్రేరణమ్మున నర్జునుం డరదమ్ము డిగునంత బగ్గమ్ముల నొగల ముడిచి శౌరియు తేరుదిగునంత దక్షిణాంబరథమ్ము భగ్గునమండె నదిగని నరుం డచ్చెరువంది కేల్మోడ్చి జనార్దనున కిట్లనియె.

ఆరభి – రూపకము

ప॥ ఆనతిమ్మ శౌరీ నా - కరదము మండిన కారణ ॥మూ॥
అ॥ప॥ ఏ నిది వినదగునటయేని - గనుగొను నాశ్చర్యకరం ॥బౌ॥

చరణము

కటికి తెప్పవలె మమ్ము - గాపాడితివి యంతదనుక
వెంటునంటి పున్నెంబుల - పంటపీవు కౌంతేయుల ॥కాన॥

సీ. ఆసిన మురారాతి ♦ యనియె వాసవి కిట్లు
ద్రోణ గాంగేయ క ♦ ర్ణుల మహాస్త్ర
పావకజ్వాలల ♦ బడియున్న దీని ర
క్షించితి నెట్టులో ♦ యింతదనుక
జగడంపు గ్రతు వింక ♦ సాంతమయ్యెం గాన
గడకిట్లు గాలగా ♦ విడచినాడ
దురము నారంభించు ♦ తఱి నారుమధుపర్క–
మిడి నిన్ను సూపి ర ♦ క్షింపు మనుచు
తే. గీ. ధర్మజుం డప్పగించె; యు ♦ ద్ధమున నీగ
నేని నీరయి ప్రాలగా ♦ నీక విజయ

ముందజేసి కృతార్థుఁడు ♦ నగుట కెల్ల
కారణము నాఁడు మేనత్త ♦ కడుపు జలువ.

తే. గీ. అని సమాధానముం జెప్పి ♦ యచ్యుతుండు
వారి నార్వుర దోడ్కొని ♦ వేగ నొక్క
పతియు నందగు నొకపుణ్య ♦ వాహినికడ
కచట నిట్లనె హరికి యా ♦ మాత్మజుండు.

ఉ. కౌరవనాథు నక్రమము ♦ గా బడగూల్చితి మంచు మమ్ము గాం
ధారి శపించునేమొకో? జ ♦ నార్దన! నీవొకసారి పోయి యా
వ్వారల నూఱడింపు మన ♦ వారిజనాభుఁడు సత్వరమ్ముగా
వారణపట్టణమ్ము సని ♦ వచ్చె వెసం బనిఁజెప్పి యెంతయున్.

క. వారిజనాభుఁడు పాండుకు
మారుల పనిదీర్చి సుఖము ♦ మై నుండ నటన్
గౌరవపతి తలిదండ్రుల
బేరుకొనుచు నెంతయేని ♦ పిలపించె నిటుల్.

ముఖారి — ఆది

ప॥ తొడలువిఱిగి పుడమింబడి యుంటిని ధూళిధూసరిత దేహుఁడనైతిని॥
అ॥ప॥ చెనఁగులైనకొడుకుల నూరులమ్ము నగుడిచెద రాకష్టము వార్ధకమున॥

చరణము

చీకటాల్మగలు మీకింత నేడు - చేయూతగ నొకడైన లేకుండ
బోకార్పించిన దుష్టుడ నిమ్ము - శోకార్ణవ నిర్మగ్నులం జేసి ॥తొ॥

ఉ. ఎందరి గన్న నేమి? తుద ♦ కిట్లసహాయుల జేసి నేటికీ
కుం దొడగూర్చితిన్ విధవ ♦ కూతురు దిక్కుగ వార్ధకమ్మునన్
బందుగులైన లేక పగ ♦ వారల కొంపల కంపి కూటికై
పంద సుయోధనుం దొడలు ♦ వాయు నిదే కలనన్, క్షమింపుడీ.

వ. అని విలపించుచు భానుమతిం దలచి.

చ. అరయగ నెండకన్నెఱుగ ♦ నట్టి లతాంగివి, నేను ద్రోవదిం
బరిభవముం బొనర్చిన నె ♦ పమ్మున వాయుసుతుండు కోపసం

భరమున నూనహాని సలుపు దలపెట్టునో నీకు? కావున న్
శరణము వేడుకొమ్మిపుడ జాతరిపున్ సమవర్తినందనున్.

గీ. ఇట్లు పలవించు ధరణీశ లేంద్రుకడకు
కృపుడు కృతవర్మ ద్రౌణియు నేగుదెంచి
సర్వము నెఱింగి బిట్టు వి చారపడిరి
వారిలో ద్రౌణి పల్కె గో పమ్ము గదుర.

పూరి - ఆది

ప॥ నిన్న ధర్మయుద్ధమ్మున గూల్చిర నీటినుండి వెడలించి పాండవులు॥ని॥
అ॥ప॥ అన్నన్నా! తలచన్నెనా? భీము-డన్యాయముగ బనిగొలుపక శివశివ ॥ని॥

చరణము

నేడు పాండవుల గావించి ద్రౌణి-నీ మనోరథము దీర్పగా గలడు
వాడిసూపి రిపువారి మెల్ల నుగ్గాడు వాడ నన్నభిషేకింపుము ॥ని॥

చ. అనవిని కౌరవేంద్రుడపు డా కృపుచే జలముంది ద్రోణనం
దను నభిషిక్తు జేయ బను దమ్మున ద్రౌణియు సింహనాదముం
బొనరిచి యా దవోత్తము కృ పుల్దన కయ్యెడ దోడుగాగ న
ల్లన సనె పాండుపుత్ర శిబి రంబుల వంకకు, జారె సంజయున్.

ఉ. సైనికులెల్లరు న్గెలుపు సందడి నుండగ నెఱింగి ముప్వురు
న్మానుగ కొంతదవ్వరిగి మార్గమున న్వటభూజ మొక్కెడం
గానబడ న్సమీపమున కర్కశమౌ ధరణీ తలమ్మునన్
మేనులువైవ నిద్రవోడ మొగి కృతవర్మకు ద్రౌణిమామకున్.

సీ. క్రోధాతిశయమునన్ గురునందనుడు నిద్ర
వోవక యవ్వట భూజశాఖ
గనుగొను చో నులూ కంబొండు కొమ్మపై
నిదురించు వాయస నివహములను
గంఠము ల్నులిమి ప క్షుమ్ములు నఱికి పొ
ట్టలు వ్రచ్చుచుం జంపు ట దిలకించి
కౌశికం బ ట్లుపదేశమిచ్చె నటంచు
దలచి యిర్వుర మేలు కొలిపి తాను

వర్మలం దోడ్కొని శిబిరంబులకడ కరిగి తొల్త ధృష్టద్యుమ్ను డున్నెడకుం జని శిరంబు దలంచుచు,

సీ. ఇరుగాల నొడయుము పై ♦ న్నురము ద్రొక్కి బిరాన
సమయించె ద్రుపదభూ ♦ జానితనయు
దలపట్టి యూడ్చుచు ♦ దక్కు పాంచాలుర
నెల్లర వధియించె ♦ హేతిధార
కరితురంగములపై ♦ గూలికి మోరలు చెక్కి
పీనుగుపెంట గా ♦ వింపదొడగె
కోపవేగమున ను ♦ ద్దీపించి పైబడి
ద్రౌపదీతనయులం ♦ దపిలి సంపె
తే. గీ. వేగుజామున కెల్లగన్ ♦ వెస వధించి
తత్క్షణం బేగి యది సుయో ♦ ధనున కెఱుక
పఱప హర్షించి యతడు జీ ♦ వముల విడిచె
ద్రౌణి వ్యాసాశ్రమము జేరె ♦ తపమొనర్ప.

చ. తెలతెలవార నయ్యది యు ♦ ధిష్ఠిరముఖ్యు లెఱింగి కుందుచో
జలరుహనాభు గూడి పటు ♦ శౌర్యమునన్ విజయుండు భీముడుం
జలమున ద్రౌణి యున్నెడ ♦ సత్వర మేగి తదాశ్రమంబునన్
లలి జపమాల ద్రిప్పుకొను ♦ రక్త సుశీలిన ద్రోణనందనున్.

వ. కనుగొని కోపసంరంభులై,

నాట - చతురశ్రగతి

ప॥ ద్రోసమునకు పసిబాలురంజంపి-దొంగజపముగావించుచున్నావ॥ద్రో॥
అ॥ప॥ నీసదువంతయు నేలగలసెనా - నిద్రాణుల నిసివేళ వధింతువ॥
1. పాండుసుతుల కపకార మొనరించి-ప్రాణములకు జెడకుండు వీవిట్లు
దుండగీడవై నీ వీ నాటికి - ద్రోణు ప్రతిష్ఠయు గంగగల్పితే ॥ద్రో॥
2. గురుసుతుండవను మరియాదన్నిను-బరిమార్పకుండ మేమురకున్నను
యురకుండవుగదయు గ్గాండీవం-బ్రోవిప్రాధమ! లేచిరావేమి ॥ద్రో॥

తే. గీ. అనినవిని ద్రోణనందను ♦ డాతురంబు
బ్రహ్మశిరము నొదలచియు ♦ పాండవులకు
గా దృణాంబొండు మంత్రించి ♦ కనలి విడువ
మండుచును దన్ను గావుమనునో ♦ నాగాంధిపుండు.

ఉ. కవ్వడిచే దదస్త్రమును ♦ గ్రన్నన నేమగ జేయ నస్త్రముల్
జివ్వకుసిద్ధమైనయట్టు ♦ దెచ్చెగ దాకిన భస్మరాశిగా
నవ్వసుధాతలమ్ము కల ♦ హాశన ముఖ్యమునివ్రజమ్ము నీ
దవ్వులనుండివచ్చి వసు ♦ ధాసురపాస్థ్యము నాదరించెనున్.

తే. గీ. ఇరువురస్త్రమ్ము లుపసంహ ♦ రింపుడనగ
నర్జునుం డట్లొనర్చె ద్రో ♦ ణాత్మజాతు
డొప్పకున్నంత వ్యాసాగు ♦ లప్పుడతని
మందలించుచు యత్నించి ♦ సాగనిచ్చె.

వ. ద్రోణిశిరంబునంగల రత్నంబును పాండవమధ్యమున కీప్సించె నంత గోపమ్మువిడువక గురునందనుం డయ్యస్త్రమ్ము నుత్తరాగర్భమ్ము జెఱచుగాక యనిపల్కి ప్రజ్వలింపజేసిన శౌరియు జక్రంబడ్డిడి తదస్త్రము వారించి పరీక్షితునకు ప్రాణంబిడె మూడువేలేండ్లన్న వస్త్రమ్ములు లభింపక దుర్గంధదూషిత దేహుండవై యుండుదు గాక యని యశ్వత్థామకు శాపంబిచ్చి శిరోరత్నంబును పాండవులచే ద్రోవదికిప్పించి యామె నూరార్చె నంత ధర్మజుండును గాంధారీ ధృతరాష్ట్రప్రముఖ్యుల నెల్ల నూరడించి కుంతివలన గర్ణుండు తనకన్న యనివిని సోదరులుం దానును జింతించి యెల్లవారికిం దర్పణాదులొసంగి యనంతరం బొక్క శుభదినమ్మున శ్రీకృష్ణానుమతంబున బట్టాభిషిక్తుండై యెల్లరకుం గన్నులపండు వొనర్చి యంపశయ్యనున్న భీష్మునివలన సమస్త ధర్మాధర్మము లెఱింగి యయ్యనఘుండు మాఘమాసమ్మున శుక్లపక్షమ్మునందలి యేకాదశినాడు శ్రీకృష్ణునందైక్యమ్ముగా హస్తిపురమ్ము సేరి వ్యాసాదులయును

మతంబున నశ్వమేధం బొనర్చి సుఖమ్ముగ బెద్దకాలమ్ము రాజ్యపాలన మొనర్చుచో సకల సన్మంగళ ప్రదుండగు మాధవున కెల్లరు మంగళమ్ము పాడిరి.

సురటిరంగు - మిశ్రగతి.

ప॥ హారతిగోకులబాల గొను - మాశ్రితజనానుకూల కృష్ణ ॥హార॥

అ॥ ప॥ సరసిజభవసేవితపద - నిర్జరపాల శివ - సారసదళలోచనయుగ సత్యావిలోలా - గోపాల కళ్యాణశీలా ॥హార॥

చరణము

ఘోరసంగరపరాజిత - చైద్యమాగధసార ప్రమథావనను - ద్వార ప్రతిభావిభాసిత భీష్మకరాజాత్మజా - హృ - చ్చోర నందకు-మార దురిత వి - దూర కౌస్తుభహార జాంబవతీవరా-వర కామిత జనకల్ప కా - పాహిమాం సకలాగమస్తుత లీల - కాంచనచేల దానవ - కాల నతసుర - జాల నీరద - నీలదేహ జనార్దనా పావనా - దేవ ముని సంభావనా - సద్గుణనిధాన ॥హారతి॥

క. గిరిజామనోంబురుహాబం
-భర ! విశ్వంభర ! మహేశ ! ♦ పాపవినాశా !
కరుణన్ మత్కృతభారత
చరితముగైకొనుము దీని ♦ చంద్రార్ధధరా !



# ప్రశంసాపేశలం



1. తత్త ద్గాథా రస మనుగతం ధావతే శబ్ద జాలం
మార్గైః ప్రత్నం నవమపి మహాః సంవిధత్తే సమస్తం
సారం నీత్వాఽమృత మహహా! జగన్ భారత శ్రీరవార్ధేః
సుబ్రహ్మణ్యా! ప్రమద మతులం సాధ్విః భూతనామ్నాం.

2. రస విసర స్ఫార సాహితీ ♦ ప్రసృత సత్క-
థా రచన శక్తి, సత్సభా ♦ స్థలుల గాన
కళలు వెలయించి విలసించు ♦ గరిమ గలుగ
కథక వాచస్పతిత్వ మ ♦ గ్గలవు బిరుదు?

3. హరికథాకథనమున ని ♦ యతుల శక్తి
స్వర్ణ కంకణ ఘంటికా ♦ స్వనమె తెలుపు
కొలిచి యమృతంబు దేవతా ♦ వళికి నిచ్చు
చంద్రునకు నీవిధమ్ముగ ల ♦ జ్జను ఘటించు.

4. ఇతో ప్యధిక మాధురీ మృదుళ బంధ సంధానభా
జ్మనోహర కథాదికం బహుళ మోద మాపాదయేః
విరచ్య కవిచంద్ర! తద్దిగిభ దంత భూషాయితాం
యశో విమల మల్లికా కుసుమ మాలికా హేళికాం.

ఏలూరు,
18—11—37

శ్రీ వేంకట పార్థసారథి కవులు.
శతావధానులు.

